# మహిళల ఆరోగ్య రక్షణకు

## లోధ్ర

### గర్భాశయరోగ నివారిణి

స్త్రీలకు గలుగు ఋతుదోషాలు, బహిష్టు కాకుండుట, అకాలబహిష్టు, మైల జాస్తిగాను తక్కువగాను పోవుట, కుసుమరోగము, సంతానహీనత, రక్తహీనత, మలబద్ధము, సూతికావాతము, కీళ్లనొప్పులు, అరికాళ్లు అరచేతులు మంట మొదలగు స్త్రీ మర్మ వ్యాధులను కుదుర్చును.

12 ఔ. రు. 4-4-0   6 ఔ. రు. 2-4-0

## మాదీఫల రసాయనము

ఇది ముదిరిన మాదీఫలముల రసముతో తయారు చేయబడినది. గర్భిణీ స్త్రీలకు కలుగు వాంతులకు (వేవిళ్లు) యిది సంజీవివంటిది. తలతిరుగుడు, వాంతులు, అరోచకము, అజీర్ణము, మలబద్ధకము, నిద్రలేమి మొదలగు జబ్బులకు వజ్రాయుధము. జ్వరవేగమును తగ్గించుటలో యీ రసాయనము పేరుపొందినది. ఇది తేనెవలెయుండి నోటికి రుచిగను యింపుగను నుండును.

3 ఔన్సుల బుడ్డి రు 1-4-0

## గర్భరక్షక

స్త్రీలు బలహీనులగుటచేత గర్భము ధరించిన పిమ్మట పెక్కురుగ్మతల పాలగుచున్నారు. ముఖ్యముగ వీరలకు గర్భస్రావము, అకాలప్రసవము, అప్పుడప్పుడు కడుపునొప్పి, నడుమునొప్పి, రక్తహీనము, శరీరమందు నీరుచేరుట, బలహీనము, అలసట, ఆయాసము, అజీర్తి, మలబద్ధకము మొదలగు జబ్బులు కలుగుచున్నవి. ఈ 'గర్భరక్షక' సేవించిన పై జబ్బులు రాకుండుటయే గాక ప్రసవించువరకును శరీరము మంచి ఆరోగ్యస్థితి గలిగియుండి నిండుమాసములు గర్భము ధరించి సుఖముగ ప్రసవింపెదరు.

3 ఔ॥ రు. 3-2-0   6 ఔ॥ రు. 5-8-0

## క్షీరబలా తైలం

స్త్రీలకు ఋతుస్రావ దోషముచే గల్గు వాత వ్యాధులు, పార్శ్వపు తలనొప్పులు, తలపోటు, గర్భవాతము, శరీరము బలిసియుండుట, మూర్ఛ, అపస్మారవ్యాధులు, క్షయావ్యాధి, నరముల బలహీనత, యీ తైలముతో అభ్యంజన మొనర్చిన నివర్తించును.

6 ఔ॥ల బుడ్డి రు. 3-0-0

## సౌభాగ్య శొంఠి

### బాలింత లేహ్యము

ప్రసవానంతరమున స్త్రీలకు బాలింతకారమును ఒక ఘాటు ఔషధమును యిచ్చు ఆచారము మన దేశమున చిరకాలముగనున్నది. అయితే ఈ కారమును లెక్కలేనన్ని పచారిదుకాణపు సామానులతో తయారు చేసి యిచ్చుచున్నారు. ఇందు కలియు వస్తువుల పరిమాణమును, పదార్థజ్ఞానమును పాటింపక మందును తయారు చేయుదురు. ఈ కారము నాలికి వేడిచేసి అనేక రుగ్మతలు సంభవించుచున్నవి. ఈ సౌభాగ్య శొంఠిని వాడిన ఆరోగ్యము చెడక తల్లియు బిడ్డయు సుఖముగ నుండగలరు. తల్లికి సమృద్ధిగ పాలుపడును.

బుడ్డి రు. 2-0-0

## ప్రమేహాంతకం

### (తెలబట్టవ్యాధికి)

అనేక కారణములవలన స్త్రీలకు గర్భాశయము నుండి తెల్లటిద్రవము వెడలుచుండును. స్త్రీజాతి యందు యీజబ్బు సర్వసాధారణముగనుండును. పసిపిల్లలకుగూడ యీవ్యాధి సంభవించుచున్నది. చిరకాలముగ యీవ్యాధివల్ల బాధపడువారి గర్భాశయము పుండగును. అట్టివారికి మేహజ్వరము, దగ్గు, నిస్సత్తువ, సంతానహీనత సంభవించును.

బుడ్డి రు. 4-0-0

## కేసరి కుటీరం లిమిటెడ్,

15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు 14

తెనుగుజిల్లాలకు, నైజాముకు ఏజంట్లు

**సీతారాం జనరల్ స్టోర్సు, బెజవాడ - సికిందరాబాదు**

GRIHALAKSHMI

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట·
· కేర్పడిన సచిత్ర మాస పత్రిక

వ్యవస్థాపకులు :
## డాక్టరు కే. యన్. కేసరి

ఆక్టింగ్ ఎడిటర్
సి. సి. పున్నయ్య

సంపుటము ౨౩]  ఫిబ్రవరి 1954  [సంచిక ౨

# విషయసూచిక

—o—

# మనుజునకు రక్తమే జీవనము

రక్తమే ప్రాణాధారము. ఈ రక్తము దేహమంతయు నాడుల మార్గమున పారి శరీరపటుత్వమును కలిగించుచున్నది. రక్తము మనము భుజించు ఆహారము నుండి పుట్టుచున్నది. కొందరు తమ శరీరదార్ఢ్యమును కాపాడుకొను మార్గములను మఱచి వ్యాధుల పాలగుచున్నారు. ఇక్కాలపు విద్యావ్యాసంగము ఉద్యోగ ధర్మములు చాలవరకు మనుజులను అనారోగ్యులుగ జేయుచున్నవి. మఱియు విశేష సంచారము, అకాల భోజనము, మితిమీరిన భోజనము, మనోవ్యాకులము, మొదలగు వాటిచేత మనుజునకు జఠరాగ్ని మందగించి ఆహారమందు యిచ్ఛలేక వ్యాధిగ్రస్తుడగుచున్నాడు. ఈ కారణమువలన కొంతకాలమునకు శరీరమునందు నిరాటంకముగా ప్రవహించెడు రక్తమునకు ఆటంకము గలిగి అశక్తుడై, రక్తముచెడి అజీర్ణము ముఖ్యముగా సంభవించుచున్నది. ఈ అజీర్ణవ్యాధిని ఆధారపఱుచుకొని గుల్మము, కడుపుబ్బరము, మలబద్ధము, భేదులు, వాంతి, అరుచి, పాండు, కామిల మొదలగు వ్యాధులు కలుగుచున్నవి — మందబుద్ధి, ధాతుక్షీణము కూడ కలుగుచున్నవి. అపరిశుద్ధ రక్తమువలన శోభ, తీట, మేహపొడ, తామర, మేహవ్రణములు మొదలగు చర్మవ్యాధులు కలుగుచున్నవి.

ధాతుక్షీణము, అశుద్ధరక్తము, రక్తమునకు ఆటంకము కలిగించి పక్షవాతము, సంధివాతము, మొదలగు వాతరోగములు సంభవించుచున్నవి. శ్వాసకోశములు, హృదయము, పిత్తకోశముచెడి, కాసక్షయాదులు, హృద్రోగము, ఉన్మాదము, మూర్ఛ, మొదలగు వ్యాధులు సంభవించును.

సమస్తవ్యాధులకు మూల కారణమగు ఆపరిశుద్ధ రక్తమును శుద్ధపరచి మనుజుని ఆరోగ్యమును కాపాడుటకు మా 'అమృత' శ్రేష్ఠమయినదని వాడినవారు చెప్పుచున్నారు.

'అమృత' పైవ్యాధులను కుదుర్చుటయేగాక నిలుకడగనుండు తలనొప్పి, కడుపులోమంట, అఱచేతులు, అరికాళ్లు, కండ్లమంటలు, నిస్సత్తువ, నిద్రలేమి, వీటిని నివర్తించును.

'అమృత' లో మూత్రసంబంధమైన జబ్బులను కుదుర్చు ఓషధులు కలిసియుండుటచే మూత్రపు అడ్డు తొలగి ప్రమేహ రోగములును కుదురును. విషములను విరుచుమూలికలు చేరియున్నవి గనుక, విషక్రిమి కాటులవల్లను, రసగంధక, పాషాణాది విషద్రవ్య దోషములవల్లను చెడినరక్తమును శుద్ధియగును.

'అమృత' వలన స్వప్నస్ఖలనము, శుక్లస్రావము, మందబుద్ధి, సుఖ సంకటములు, కీళ్లనొప్పులు మొదలగు జబ్బులు కుదురుచున్నవి. మంచిబలము, రక్తవృద్ధి, ఆరోగ్యము, ఇంద్రియపుష్టి, వాక్చాతుర్యము, దీర్ఘాలోచనశక్తి కలుగుచున్నవి.

'అమృత' సారవంతములగు మూలికలతోను, రసవంతములగు ఫలములతోను, మకరందపూరితములగు పుష్పజాతులతోను తయారుచేయబడిన ద్రావకము. ఇది బాల్య, యౌవన, కౌమార, వార్ధక్యదశల యందు ఎల్లరు సేవించుటకు దగినట్లు తయారు చేయబడినది.

'అమృత' యను నామమునకు తగినట్లు రుచికరముగను యింపైన సువాసనతో నిండియుండునట్లుగను తయారు చేయబడినది.

12 ఔ॥ బుడ్డి రు. 4-4-0

6 ఔ॥ బుడ్డి రు. 2-4-0

## కేసరి కుటీరం లిమిటెడ్

15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు 14

తెలుగుజిల్లాలకు. నైజామునకు ఏజంట్లు :

శీతారాం జనరల్ స్టోర్సు, బెజవాడ — సికిందరాబాదు




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్థసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువకు సరిపడు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువదైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగనున్న శీఘ్రప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వస్వాతంత్ర్యములు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.




జయజయ గృహలక్ష్మీ సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!



# పురోభివృద్ధి — ప్రజలు

ఏ దేశమయినా పురోభివృద్ధిగాంచాలంటే స్త్రీలు, పురుషులు సమిష్టిగా బాధ్యతల నిర్వహిస్తూ సమానంగా హక్కులను, అవకాశములను అనుభవించాలి. ఇందులో నెవరు దేనిని విస్మరించినా దేశం, దానితోటి ప్రజలు పురోగమించలేరు.

ప్రస్తుతము మన దేశంలోని ఆర్థిక దుస్థితిని తొలగించడానికి కేంద్రప్రభుత్వము, రాష్ట్రప్రభుత్వాలు ఆలోచిస్తున్నవి; ప్రణాళికల తయారుచేస్తున్నవి. ముఖ్యంగా ఆంధ్ర ప్రభుత్వము ప్రాజక్టుల నిర్మాణ సందర్భముననేమి, యితర ప్రజాహిత కార్యకలాపాల నిర్వహణ కార్యక్రమముననేమి అత్యంతశ్రద్ధతో ముందంజవేస్తున్నది. కాని ప్రభుత్వ ఆదయవ్యయాలను బట్టి ప్రభుత్వకార్యక్రమాలు, ప్రణాళికలు శీఘ్రగతిన ఫలప్రదం కావాలంటే ప్రజాసహకారసహాయాలు కావాలి. అవిలేనిదే ప్రభుత్వశ్రద్ధా, సత్తులవలన మాత్రం అంతగా లాభముండదు.

ఈ సందర్భమున ప్రజాసహకార సహాయాలు ఏ రూపంలోనుండాలి? ముఖ్యంగా స్త్రీలు ఎలాసహకరించి తమ దేశభావిభాగ్యోదయానికి దోహదం చెయ్యగలరు? అనే విషయాలను ప్రజలు గుర్తించాలి.

దేశంలో నలుమూలలా దారిద్ర్యం వికృతరూపంతోనున్నది. కాని మరొక ప్రక్క దుబారాయున్నది. దుబారా అనేది తమకు ప్రధానావసరము కాకపోయినా విలాసంకొరకు జరుగుచున్నఖర్చు. కూడు, గుడ్డలేక అల్లాడుతూన్న ప్రజానీకంపట్ల సానుభూతి సూచకంగానైనా దుబారానరికట్టి మిగిల్చిన డబ్బును సంపన్న గృహిణులు ప్రజాహిత ప్రణాళికల నిర్వహణకు ప్రభుత్వానికి పెట్టుబడి పెట్టుటవలన చాలమేలు కలుగుతుంది. ఇది వ్యక్తిగతంగా ఏ ఒక్కరి అభివృద్ధికి నుద్దేశించినదికాదు. దేశం మొత్తం సస్యశ్యామలంగాను, భోగభాగ్యాలతోను పురోభివృద్ధిగాంచినపుడు కూడుగుడ్డ లాంటి ప్రధానవసరములకు కొరతయుండదు. నిరుద్యోగసమస్య శాశ్వత పరిష్కారానికి అవకాశములు మెరుగుకాగలవు.

ఇంకా హెచ్చుజీతాలుపొందే ఉద్యోగులు, అధికలాభాలు సంపాదించే పారిశ్రామిక సంస్థలు, వ్యాపారులు, భూస్వాములు తాము ఆర్జించిన దానిలో అవకాశమున్నంత ధనమును ప్రభుత్వమునకు పెట్టుబడిపెట్టి ప్రభుత్వ ప్రజాహిత కార్యకలాపాలను, ప్రణాళికల నిర్వహణను ప్రోత్సహించునట్లు వారి గృహిణులు కృషిచెయ్యాలి.

వ్యవసాయ కూలీలు తమ జీవనభృతి ఆర్జనతోబాటు ప్రాజక్టుల నిర్మాణంలో ఉత్సాహంచూపుతూ సాగుకనువైనభూమి అవకాశమున్నంత త్వరలో ఫలవంతమగునట్లు కృషిచెయ్యాలి.

తమ కుటుంబ బాగోగుల దిద్దుకొనుటలో స్త్రీపురుషులు సమానంగా బాధ్యులు. తమ కుటుంబ అవసరాలమేరకు ఆదాయం పెరుగుటకు సమిష్టికృషి అవసరం. ఈ విషయాన్ని ముఖ్యంగా మధ్యతరగతి కుటుంబాలవారు గుర్తించి వ్యవహరించాలి.

ప్రాజక్టుల నిర్మాణం మూలంగా పంటభూములకు నీటివసతులు, పరిశ్రమలకు విద్యుచ్ఛక్తి లభ్యములు. వానితోటి ఆహార ధాన్యాలపంట, భారీపరిశ్రమల నిర్వహణలేకాక ప్రజావసరముల తీర్చగల గృహపరిశ్రమల నిర్వహణ, ఆహారమును స్వయం సమృద్ధం చేయగల ఫలజాతులు, కాయగూరల ఉత్పత్తి, పాలు, వెన్న, నెయ్యి మొదలగునవి సప్లయి నుద్దేశించు పశుసంపద అభివృద్ధికి ఆధునిక పద్ధతులలో మరింత ఫలప్రదంగా నిర్వహించుట కవకాశములున్నవి. నిరుద్యోగ సమస్యా పరిష్కారం సులభసాధ్యం కాగలదు. ప్రభుత్వముతో సహకరించి సదవకాశములను వినియోగించుకొని తరతరాలకు సుఖపడవలసినవారు ప్రజలు.

# జంగం కథ

శ్రీ ఓరుమల్ల కామేశ్వరరావు

## రామాయణ భారతకథల ప్రభావం

జంగం కథలమీద రామాయణ భారతకథల ప్రభావముందా అనే దొక ప్రశ్న.

ఆర్యులలో ఒక మహాపురుషుడైన రాముడికథ రామాయణంలో చెప్పబడింది. రామాయణానికీ, కాంభోజరాజుకథకి కొన్ని సమాన లక్షణాలున్నట్టుగా పైపై దృష్టికి కనబడుతుంది. కాని రెండూ వేరు వేరు కథలే.

రామాయణ కథలోని, భారత కథలోని సాంఘిక ధర్మాలకు కొంత భేదముంది. రామాయణకథ ఏకపత్నీ వ్రతాన్ని బోధిస్తూంది. భారతకథలో ద్రౌపదికి అయిదుగురు భర్తలు. అర్జునుడు పలువురు స్త్రీలను వివాహమాడేడు. కాంభోజరాజుకథలోని బాలరాజు అనేకమంది స్త్రీలను వివాహమాడడం అర్జునాదులు చేసినట్టేఉంది. ఈ పద్ధతిని హిందూపరిపాలకులు అనుసరిస్తూ వచ్చేరు.

బాలనాగమ్మకథలో మాత్రం రామాయణకథ యొక్క అనుకరణమనిపించే ఒక ఘట్టం కనబడుతుంది. రావణుడు సీతని ఎత్తుకుపోయినట్టు మాయల ఫకీరు బాలనాగమ్మని ఎత్తుకుపోయేడు. అయినా ఇది అనుకరణమని చెప్పడానికిలేదు. ఆనాటి తురక పరిపాలకులు ఇట్టి దుండగాలను చేస్తూవచ్చేరు.

బాలనాగమ్మకథలో భారతానుకరణ మీకింద చెప్పబడినట్టుగాఉంది. తక్షకుని కాటునుండి రక్షించుకోడానికి పరీక్షిత్తు ఒంటి స్తంభపుమేడలో దాగొన్నాడు. అట్టే బాలనాగమ్మ తల్లియైన లక్ష్మీదేవికూడ పాముకాటును తప్పించుకోడానికి ఉట్టెక్కి కూర్చుంది. ఏదయినా జంగంకథలమీద రామాయణ, భారతకథల ప్రభావం చెప్పదగినంతలేదు. జంగంకథలు స్వతంత్రంగా పెరిగి వృద్ధిపొందేయి. వీటికి ఒరవడి కాంభోజరాజుకథ. ఈ కాంభోజరాజుకథ రామాయణంకంటె భిన్నమైనది. ఇది కూడ రామాయణకథవలె క్రీస్తు పూర్వపు కథే.

## జానపదకావ్యాలు, దేశికావ్యాలు, మిశ్రమార్గకావ్యాలు

ఉత్తర హిందూస్థానం మీదుగావచ్చిన ఆంధ్ర భాష తెలుగునాటి భాషతో చక్కగా మిశ్రమయింది. ఇదంతా క్రీస్తు పూర్వమే జరిగిపోయింది.

ఏ భాషకైనా గేయకవిత్వం సహజం. అది జాతితోనె పుడుతుంది. తెలుగులో అనాదిగా వస్తూన్న ఛందస్సులు ద్విపద, అక్కర, సీసం, కందం, గీతం, ఆటవెలది ఇత్యాదులు. వీటిలో ఆనాడు గేయాలుండేవని చెప్పవచ్చు. ఆంధ్ర భాషకీ, అనార్యభాషయైన తెలుగుకీ మేళవింపు జరిగినట్టే తెలుగులో అనాదిగా వస్తూన్న జానపద లక్షణాలకి, సంస్కృత లక్షణమైన అక్షర ఛందస్సులకు పరస్పర ప్రభావంకలిగింది. కొన్ని విధాలగా సంస్కృతందే పైచెయ్యి అయింది.

అరవ భాషలో క్రీస్తుప్రథమ శతాబ్దానికే కావ్య రచన ఉందని 'తొల్కాప్పియం' గ్రంథం రుజువు చేస్తూంది. అటు తర్వాత ఎనిమిదో శతాబ్దంలో కన్నడభాషా శాసనాలలో సంస్కృత లక్షణాన్ని అనుసరించిన వృత్తాలు కనబడుతున్నాయి. తెలుగు స్థితేమిటి? క్రీస్తు శకానికి ఎంతో ముందే జానపద ఛందస్సులలో గేయాలు బయలుదేరి ఉంటాయి. ఆంధ్రభాష, తెలుగు భాషతో మిశ్రమయిన తర్వాత

కూడ ఎన్నో పాటలు వెలసిఉంటాయి. కాని ఇక్కడ ఒక ముఖ్యఘట్టమేర్పడింది. దీని ఫలితాలు చాల అద్భుతమైనవి. ఈ నాడు అనగా ఇరవయో శతాబ్దంలో కొత్త కవులు వ్రాసే గేయాలకు తలతోక లేదంటూ, వ్యావహారిక భాషకి నియమాలు లేవంటూ, పెద్దలు మొరపెడుతున్నారు కదా! అట్లాగే ఆ కాలంలో కూడ సంస్కృత పండితులు ప్రజలు పాడుకొనే గేయాలకు నియమాలు లేవంటూ విచారించి ఉంటారు పాపం! ప్రజల భాషను, ప్రజల కవిత్వాన్ని ఉద్ధరించవలసిన విధి రాజులది కదా! కాబట్టి ఆ నాటి రాజు జానపద గేయాలను 'బాగుచెయ్యడానికి' వీలుందో లేదో చూడమని ఆస్థాన సంస్కృత పండితులకు అప్పజెప్పి ఉంటాడు. సంస్కృత పండితుల కొలబద్ద సంస్కృతంలోని అక్షరఛందస్సు. దానితో వారు జానపద గేయాలను కొలిచేరు. చూచినకొద్దీ అంతా అవకతవకగా కనబడింది. భారం తమమీద వేసుకొని జానపద లక్షణాలను 'సవరించడం' మొదలు పెట్టేరు. అంతే కాని తమ కొలబద్దలోనే లోటుపాట్లు ఉన్నాయనీ, అది మరొక తరహా వాటిని కొలవడానికి పనికిరాదనీ వారు ఊహించలేకపోయేరు. తమకి చేతనయినంత వరకు జానపద ఛందస్సులను సంస్కరించేరు. అసలు వాటికీ, సంస్కరింపబడ్డ వాటికి చాల తేడా ఉంది కాబట్టి సంస్కరింపబడ్డ వాటికి జాతులు, ఉపజాతులు అని నామకరణం చేసేరు. ఇట్లు అవి వేరుగా ఏర్పడ్డాయి. జానపదలక్షణం జానపదలక్షణంగానే సాధారణ ప్రజల నోళ్లలో ఉండిపోయింది! పండితులచేత సంస్కరింపబడ్డ రూపమే దేశి. దేశియొక్క జన్మవృత్తాంతమది.

ఆ విధంగా తెలుగు కవిత్వంలో మూడు రకాల రచనలున్నాయి. 1. జానపదలక్షణంగలవి 2. దేశిలక్షణంగలది 3. సంస్కృతాన్ని అనుసరించి అక్షరఛందస్సులుగలది.

ఆ కాలంలో జరిగిన మహా సంఘర్షణ నన్నెచోడుని (క్రీ. శ. 850) కుమార సంభవ పీఠికలోని పద్యంద్వారా కొంత బోధపడుతూంది.

క. మునుమార్గ కవిలోకం
బున వెలయగ దేశికవిత బుట్టించి తెనుం
గున నిలిపి రంధ్ర విషయంబున
జన సత్యాశ్రయుని తొట్టి చాళుక్య
నృపుల్

(ఆ 1 ప 23)

పై పద్యంలోని 'దేశికవిత బుట్టించి' అనుపద సంపుటి చాలఅర్థవంతమైనది. దేశికవితయొక్క పుట్టుకను వెల్లడిచేస్తూంది. దీని గాధను కొంత చూద్దాం.

సత్యాశ్రయ మహారాజు క్రీ. శ. 600 ప్రాంతపు వాడు. అతను వాతాపి ముఖ్యపట్టణంగా దక్షిణ హిందూదేశంలోని పశ్చిమభాగం కొంత మేర ఏలుతున్నాడు. అతని పూర్తిపేరు సత్యాశ్రయపులకేశి వల్లభమహారాజు. అటు తర్వాత అతను వేంగి దేశాన్ని జయించేడు. తమ్ముడైన విష్ణువర్ధనుణ్ణి వేంగికి క్రీ. శ. 624 లో రాజుగా చేసేడు. ఇతనే తూర్పు చాళుక్య రాజులకు మూలపురుషుడు. సత్యాశ్రయునిం దొట్టి చాళుక్య నృపులలో మొదటివాడితడు. మొదటి చాళుక్యరాజులు తెలుగుభాషకి చేసిన మహోపకారమంతా అంతా కాదు. వారు చేసిన ఉపకారాన్ని వారికి కొంత సమీపస్థుడైన నన్నెచోడుడు సూచించేడు. ఇతని వాక్యంయొక్క ప్రాశస్త్యాన్ని గుర్తెరిగిన కొందరు పండితులిట్లు వ్యాఖ్యానించేరు. చారిత్రక పరిశోధకులైన జయంతి రామయ్యగారు "నన్నెచోడుడు చెప్పినది సత్యమే! చాళుక్య రాజ్యముతోడ నాంధ్ర భాషయు దినదిన ప్రవర్ధమానమై రాజ రాజు (రాజనరేంద్రుడు) కాలము నాటి కున్నతస్థితికి వచ్చినది.♦ కందుకూరి వీరేశలింగం

♦ ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, సంపుటం 6 సంచిక 2 యుద్ధమల్లుని బెజవాడ శాసనము అనువ్యాసం.

గారు ఇట్లాగు పేర్కొన్నారు. ఈ సత్యాశ్రయుడు పూర్వ చాళుక్య రాజ్యమును స్థాపించిన కుబ్జవిష్ణువర్ధనుని యన్నయేయైనచో నన్నయభట్టునకు పూర్వము ఆరునూరు సంవత్సరముల క్రిందటనె తెలుగు కవిత్వ మారంభమయినట్లు తెలియవచ్చుచున్నది. కుబ్జవిష్ణువర్ధనుడు వేఁగీదేశమునఁ బరిపాలకుఁడుగా నియమింపబడుటకుముందు సత్యాశ్రయుడు కర్ణాట వేఁగీదేశములకు రెంటికిని నేకచ్ఛత్రాధిపతియయి, తన రాజ్యకాలములలో కర్ణాటాంధ్ర భాషలను రెంటిని బ్రోత్సాహపరిచెను. ఈతని తరువాతినైన కుబ్జవిష్ణువర్ధనాది చాళుక్యరాజు సహితమట్లే చేయుచు వచ్చినందున వారి యాస్థానములయందలి విద్వాంసులు సామాన్యముగ సంస్కృత కర్ణాటాంధ్ర భాషావేత్తలగుచుండిరి. నారాయణభట్టు వలెనే నన్నయభట్టును తెలుగునందు మాత్రమేగక కన్నడమునందును పాండిత్యము కలవాఁడయియుండెను. ♦

ఆ నాడు (క్రీ. శ. 600) సంస్కృత, పాలీ భాషలలో రచనలుండేవి. తెలుగుదేశపు ఆస్థానాలలో మార్గకవిత్వానికే గౌరవం! అటువంటి సందర్భంలో మొదటి చాళుక్యరాజులు జానపదకవిత్వాన్ని సంస్కరింపించి దేశిపద్ధతిని ఏర్పరిచి, రాజాస్థానార్హతను దేశికవితకి కలిగించేరు. అయితే ఇక్కడ ఒక సందేహం కలగవచ్చు. జానపద లక్షణాలు సంస్కృత పండితుల చేతులలోపడి దేశి ఆకారాన్ని పొందేయి. దీనితో జానపదగేయరచన మానిపోయిందా? సంస్కృత పండితులు చేసిన సంస్కరణమే సరియైనదైతే నిజంగా అంతపనీ జరిగుండవలసిందే! కాని వారి సంస్కరణవల్ల జానపదగేయ రచనకి భంగం కలగలేదు.

సంస్కృత పండితులు జానపదగేయాలు గణఛంధస్సుకలవిఅని తెలుసుకొన్నారు. కాని వారి గణవిభజనకు పూర్తిగా కుదరలేదు. జానపదకవిత్వ గుణాలువేరు. అవి పాడుకోడానికి అనుకూలమైనవి. ఆ కారణంవల్ల జానపదగేయాలు, దేశిపద్యాలు వేరయిపోయేయి. ఇట్లు రెండు లక్షణాలేర్పడ్డాయి. జానపదగేయ వాఙ్మయంలో జానపదద్విపదలు, జానపద అక్కరలు, జానపదసీసాలు, జానపద గీతాలు, జానపద ఆటవెలదులు మొదలైనవి. అట్లే దేశిరచనలలో దేశిద్విపదలు, దేశిసీసాలు, దేశిరగడలు, దేశిగీతాలు, దేశిఆటవెలదులు మొదలైనవి ఏర్పడ్డాయి. ఈ దేశి రకాలే జాతులు, ఉపజాతులు అను లక్షణాలు. జానపద రచనలో పాడుకోడానికి తగిన కందార్థాలు, సీసార్థాలు, గీతార్థాలు, చంపకమాలార్థాలు ఇత్యాది రచనలుకూడ ఉన్నాయి.

దేశిరచనకు రాజాస్థానంలో గౌరవమేర్పడింది. అప్పటిదశ ఏమంటే - I. కొందరు ఎప్పటిలాగే జానపద లక్షణాలలోనే రచనలు సాగించేవారు 2. ఇంకా కొందరు దేశిలక్షణాలలో రచించేవారు 3. మరి కొందరు దేశి లక్షణాలను, వృత్తాలను ఉపయోగించి రచించేవారు. ఈ మూడో పద్ధతి రచనకి మిశ్రమార్గ రచనలని పేరుపెట్టవచ్చు. ఎందుచేతంటే దీనిలో కొన్ని దేశిపద్యాలు ఉన్నాయి. కొన్ని సంస్కృత (మార్గ) లక్షణాలవీ ఉన్నాయి. ఇట్లు కవిత్వం మూడురకాలయింది I. జానపదగేయాలు 2. దేశిరచనలు 3. మిశ్రమార్గరచనలు. ప్రజా వాఙ్మయం ముఖ్యంగా జానపదగేయాలలో ఉంది. తక్కినవి రెండూ రాజాస్థానాన్ని ఆశ్రయించేయి.

దేశి రచన, మిశ్రమార్గరచన, రాజాస్థానంలో ప్రవేశించినా అగ్రతాంబూలం సంస్కృతానిదే! కాబట్టి రాజశాసనాలు, ఇత్యాదులు ప్రాకృతంలోనో, సంస్కృతంలోనో ఉండేవి. వీటిలో మధ్య మధ్య అవసరమైన తెలుగుమాటలు, ఊళ్ళపేర్లు మొదలైనవి ఉంటూండేవి. దేశికి శాసనార్హత కలగడానికి చాలకాలం పట్టిందని చెప్పవచ్చు. తరువోజ (అనగా రెండు ద్విపద పంక్తులను కలిపితే ఒక తరువోజ చరణమవుతుంది) పద్యం తొమ్మిదో శతాబ్దంలో అద్దంకి శాసనంలో కనబడుతూంది. ఆ కాలానిదే అయిన యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనంలో మధ్యాక్కర వాడబడింది. ఇట్లే మరి కొన్ని. (సశేషము)

---

♦ ఆంధ్రకవుల చరిత్రము, ప్రథమ భాగము 66–వ పుట.

# స్త్రీలు - జాతీయ వికాసము

శ్రీమతి ఊ. లక్ష్మీకాన్తమ్మ

పరమోత్కృష్టము పూజనీయమనుచుం బ్రఖ్యాతిగన్నట్టి యీ
భరతక్ష్మాతలికిన్ మహావరముగా స్వాతంత్ర్యమున్నిడ్డ య
య్యలఘు స్వాంతుని గాంధిదేవుని యమోఘాశీస్సుచే జాగృతిన్
బలమున్ బొందుచు నందిరిప్రగతి శుంభల్లీల నేడీ జనుల్ ॥

జాతివికాసము నారీ-జాతివికాసము కలుగకసంభవమనుచున్
ప్రీతి మహాత్ముడు భారతజాతీ-యోద్యమమునకును చానల బిలిచెన్ ॥

అరువదియేండ్లు వర్తిలిన హైందవదాస్య విమోచనోద్యమం
బరసిన గాంధినాయకుని యాజ్ఞల నొదల స్త్రీలు దాల్చుటన్
తరుణిసరోజనీమణియు దావహియించెను రాష్ట్రపాలనన్
లలనలు దుర్గయున్ విజయలక్ష్మియు ద్రిప్పరె రాజ్యతంత్రమున్ ॥

అట్టిదెంతయు శోభనం బయ్యె కాని-ఏవికాసము నర్థించి యిందఱట్టి
యాత్మయజ్ఞ మొనర్చి యనర్ఘజయము-కాంచిరో యట్టి జాతి వికాసమిపుడు ॥

పూర్ణతను బొందదను శంకబొందనాయె-పూర్వభారతీయోన్నతిం బూర్వరీతి
బడయనాశింతురే శంకవలవదింక-సఫలతన్ బొందు వాణి సత్కృపయొకలుగ ॥

పూరుషు లన్యకార్య తతిమోహితులై తమజాతిగున్నతిన్
గోరియు మాతృభాష నొనగూడునటంచు నెఱుంగ కంతటన్
శారదకాదరంబు నెటు సల్పరు మాటలదీరునే యిటే
నేరమునన్ వికాసము ధ్వనింపదు జాతిహృదంతరమ్మునన్ ॥

భాషయె జాతికి ప్రాణము-భాషయె జాతివికసనము ప్రాపించునెటున్
భాషాసేవను బూనగ-యోషామణులెల్లమీరు యోజింపుడికన్ ॥

(109 పేజీ చూడుడు)

# కావ్యాలలో తాంబూల ప్రశస్తి

శ్రీ దాసరి వేంకటకృష్ణయ్య

తాంబూలం అంటే తాంబూలం అంటామేగాని దానిలోని విశిష్టతను గుర్తించము. చూడండి – మన దేశంలో సంగతే – ఒక చోటవున్న భాష మరొక చోట లేదు. అట్లాగే తిండి, మతం, కట్టూ, బొట్టూ ఒక్కలాగుండవు. అయినప్పటికి తాంబూల సేవనం సర్వత్రా వుంది. దీనికి బీదా గొప్పా అనే తారతమ్యం లేదు. దక్షిణాదిన మట్టి పని చేసేవారయినా తాంబూలం లేకుంటే యేపని చేయలేరు. తిండిలేకపోయినా వుంటారుగాని తాంబూలం మాత్రం తప్పని సరిగా దగ్గర యెల్లప్పుడూ వుండాలి.

ఈ తాంబూల ప్రశస్తి కవులలోగూడ యెక్కువగా కాన్పించుతున్నది. అందుకనే శ్రీనాధుడు స్వయముగా అంగడికి పోయి తమలపాకులు బేరం చేసేవాడు. తమల పాకుల రుచి తెలిసిన అనుభవశాలి. ఇట్లా పోయివస్తూండడములో ఒక వింత జరిగింది. ఆ దుకాణముమీాదనున్న ఆడది తొలకరి మెరుపుతీగలా వుందట. ఆమెతో బేరమాడ బోయిన కవిగారికి మనసు పోయింది ఆమెమీాదికి. "ఏమిరాయిది, ఛీ, ఛీ, తమలపాకులమ్మె దానినా వల చుట" అనుకొనేసరికి ఆమె పైటలో కదులుతూన్న లింగకాయ కనిపించింది. "ఆహా! పరమేశ్వరునివంటి మహాత్ముడే లింగకాయరూపంగా అలా నాట్యమాడుతూవుంటే మన మొక లెఖ్ఖా!" అని కవి యీా విధంగా అన్నాడు.

"తొలకరి మించు తీవగతి తోచ దుకాణము
మీాద నున్న, అ
య్యలికుల వేణితో, తమలపాకుల బేరమాడ
బోయి, నే
వలచుట కేమి? శంకరునివంటి మహాత్ముడె లింగ
రూపియై
కులికెడి దాని గబ్బి చనుగుబ్బల సందున నాట్య
మాడగన్."

చేసినపనీ, దాని సమాధానము కవిగాబట్టి చక్కగా చెప్పగలిగాడు. ఈ స్త్రీ – జంగమవారి పిల్ల. శ్రీనాధుడే మరొకసారి శ్రీరంగమున ఒక వైష్ణవ యువతిని, సింహాచలమున ఒక వేపారి వెలదిని వర్ణించు పట్టునగూడ యీా తాంబూల సౌభాగ్యమును స్పృశింపక విడువలేదు చూడండి.

"హళిదా, చేత, విడియంబు గీలు కొల్పి
రంగపురి రాజవీధి, కానంగనయ్యె,
నాదు మది గోర్కెలూర వైష్ణవ వధూటి"

"పాసగక ప్రంపు వీడెముల్ పొందు పరచి
యనుగు జేడెలతో ముచ్చటలాడు కొనుచు
నలరు సింహాద్రి పైకెక్కి హర్షమునను
వచ్చె గలకంఠి వేపారి మచ్చెకంటి"

కవి చౌడప్ప, చలికాలమున వేడిమి కలిగించు సాధనముగా తాంబూలమును పేర్కొన్నాడు.

"గుడిసెయు, మంచము, కుంపటి
విడియమును, పొగాకు, తన్ను విడనొల్లని మే
ల్పడతియు గలిగిన జలి రా
క్కడి దప్పా!......................."

అని చెప్పినాడు. అంతేకాదు. రాయన భాస్కరమంత్రి "తాంబూల సత్రము" కట్టించెనని వాడుకలో గలదు.

"జలకమాడుట కింట, జల సృష్టి సత్రంబు
'తాంబూల సత్రంబు' ధన్యులకును"

యిక శ్రీ కృష్ణ దేవ రాయల నాటి తాంబూల వైభవమును అల్లసాని పెద్దన కవీంద్రుడు యిలా వర్ణించాడు.

"మృగమద సౌరభ విభవ
ద్విగుణిత ఘనసార, సాంద్ర వీటీ గంధ
స్థగి తేతర, పరిమళమై,
మగుపే పొలుపు దెలుపు, నొక్క మారుత
మొలసెన్"

కస్తూరి, పచ్చకర్పూరము మొదలగు పరిమళద్రవ్యములు కలిసిన 'తమ్మ' వాసన యితర పరిమళములను గప్పివేయగా, జవరాలి జాడ దెలుపు నొక మారుతము వీచెనట.

అష్టభోగములలో తాంబూల మొకటి. పరిమళ ద్రవ్యములతో గలిసిన తాంబూలము, భోగపురుషులు కోరుట సహజము. అట్టితాంబూలము రాగోద్దీపనకరము. అట్టిదియే - రమణుల కరానీతమయినచో నిక చెప్పవలసిన దేమిటి? కావుననే ఒక మహానుభావుడు "తాళాకార పయోధరే తవకరాత్, తాంబూల మానీయతాం" అని ఒక పిల్లనడిగాడు సున్నం. ఈ కవి యెవరో కాదు-దండి.

ఒక సారి కాళిదాసు భోగం వీధిలో విహరిస్తూ, ఒక అమ్మాయిని చూచి, ఏదో నెపం పెట్టి పల్కరించాలని పోయి, ఆకు లిమ్మని యిట్లాఅడిగాడు.

"పర్ణాని స్వర్ణ వర్ణాని
కర్ణాంతాయతలోచనే"

ఆ అమ్మాయి మనస్సు చుఱ్ఱు మనే వుంటుంది. ఇంకొక తమాషా చూడండి కొందరు కవిశేఖరులు కవిత్వంలో సున్నమడిగారు.

"పర్వతశ్రేష్ఠపుత్రిక పతివిరోధి
అన్న పెండ్లాము అత్తను గన్నతండ్రి,
ప్రేమతోడుత కన్నట్టి పెద్ద బిడ్డ
సున్నమిప్పుడు తేగదే సన్నుతాంగి."

అని సున్నమడిగాడు. పర్వత శ్రేష్ఠపుత్రిక అంటే పార్వతి. పార్వతిపతి శివుడు. శివుడి విరోధి మన్మధుడు, అతని అన్న బ్రహ్మ, బ్రహ్మదేవుని పెండ్లాము సరస్వతి. ఆమె అత్తలక్ష్మిదేవి. లక్ష్మితండ్రి సముద్రుడు. సముద్రుడు ప్రేమతో కన్న పెద్దబిడ్డ జ్యేష్టాదేవి. అంటే జెష్ఠమ్మ. పెద్దమ్మ అంటామే అది. ఇంతకీ సారాంశం "ఓ జెష్ఠా సున్నం తేవే" అని.

చూచారా! కవి చమత్కారం. అది మంచో చెడో నిర్ణయం చేయటం కష్టమైనదికాదు. అయినా, కవిబిడ్డ తోచిందేదో కవిత్వంలో అడుగుతున్నాడు. ఈ

పద్యంలో వున్న వావి వరుసలు తెలిసి యేడుస్తాయా యీ మొహానికి అనుకొని వుంటాడు. సన్నుతాంగి – తక్కువ తినింది కాదు. ఇలాంటి చుట్టరికాలు ఎన్నో చూచిన గడుసరి. ఆమెకూడ సమాధాన మిచ్చింది... చూడండి.

"శత పత్రంబుల మిత్రుని
సుతుజంపిన వాని బావ సూనుని మామన్
సతతము తల దాల్చునతని
సుతువాహన వైరివైరి సున్నంబిదిగో."

శతపత్రంబులు అంటే తామరలు. తామరల మిత్రుడు సూర్యుడు. సూర్యుడి సుతుడు కర్ణుడు. కర్ణుడిని చంపినవాడు అర్జునుడు. అర్జునుడి బావ కృష్ణుడు. కృష్ణుడు సూనుడు మన్మధుడు. మన్మధుని మామ చంద్రుడు. చంద్రుడిని ఎప్పుడూ తలదాల్చువాడు శివుడు. శివుడి పుత్రుడు వినాయకుడు. వినాయకుని వాహనం ఎలుక. ఎలుక వైరి పిల్లి. పిల్లి వైరి కుక్క. సారాశం – "ఓ కుక్కా సున్నమిదిగో" అని తేల్తుంది.

పొడుపు పద్యాలలోకూడ పూర్వ కవులు ఆకు, వక్క, సున్నం యీ మూటికి ప్రాధాన్యత నిచ్చిరి.

"పండిన యెండిన దొక్కటి
పండక మరి పచ్చిదొకటి, పడికిలినదిగా
తిండికి రుచియైయుండును
ఖండితముగ దీనిదెలుపు కవియును గలడే."

"శిలవృక్షుల తల బుట్టిన
చెలువలు మువ్వురను గూడి చిడిముడి పడుచున్
దలవాకిట రమియింతురు
చెలువలరగ దీని దెలియు సుగుణులుకలరే."

అన్నమైన లేకుండ కొందరుండ గలరుగాని తాంబూలమును వర్జించి జీవింపలేరు. చేర దగిన సువాసనద్రవ్యములు లేకున్నను యీ మూటిని సమకూర్చుకొని తాంబూలతుష్టి దీర్చుకొనలేనివాడు 'చవట' అని తేలుతున్నది. శ్రీ రాములవారు రాజ్యమేలేటప్పుడు ధాన్యములు పోకకంటేగూడ సరసమట. పోకకు బుట్టెడు ధాన్యమట. "రూక లేనివాడు పోకచేయలేడు" అని సామెత.

అల్లసాని పెద్దనగారికి "రమణీ ప్రియ దూతిక దెచ్చియిచ్చు కప్పురవిడె" మున్నగాని కవిత సాగదట.

"నిరుపహతి స్థలంబు రమణీ ప్రియదూతిక దెచ్చి
యిచ్చు క
ప్పుర విడెమాత్మకింపయిన భోజనముయ్యెల మంచ
మొప్పు త
ప్పరయు రసజ్ఞులూహ తెలియంగల లేఖక పాఠ
కోత్తముల్
దొరికిన గాక యూరక కృతుల్ రచియింపుమనంగ
శక్యమే."

అని ఆంధ్రభోజుడు శ్రీ కృష్ణదేవరాయలు కృతిరచియింపు మన్నపుడొకసారి చెప్పినాడు. ఇంకా తాంబూల తమాషాలు యెన్నో వున్నాయ్ యిప్పటికి శలవ్.

బెజవాడ ఆలిండియా రేడియోవారి సౌజన్యముతో

# కడుపుతీపి

శ్రీ ఇసుకపల్లి లక్ష్మీనరసింహశాస్త్రి

"బస్తీలో వుద్యోగం. ఎన్నాళ్లు హోటల్లో పడి అఘోరిస్తాడు. పూటకూళ్ల తిండి పడుతుందా చేస్తుందా. ఇంతే పెళ్లిపెటాకులు అంటూచేస్తే వాళ్ళకాపరం వాళ్లు చేసుకుంటారు అని, ఆ రోజుల్లో జబ్బుమనిషి అని వాడుకపడింది అందువలన సంబంధాలుయేమి యెక్కరాల. చచ్చిస్వర్గానవున్నాడు మా అన్నయ్యను బ్రతిమాలి, ఎంతైనా తల్లితోడుకద, ఆమేనరికంకాస్తచేశా. ఇల్లుగొరకేట్లులేదని వుత్తరాలు వ్రాస్తే, చచ్చినట్టు నేనువెళ్ళి అక్కడ యిక్కడ బ్రతిమాలి రెండుగదులు కుదిర్చివచ్చా. వస్తేను— ముందరే అద్దెడబ్బు కట్టాలన్నారు ఆరునెలలకు. ఆ కాసులపేరుకాస్త అమ్మి, మాకు మిగిల్చింది అదేగా. మిగతాదంతా వారి అప్పులకే సరిపోయిందికాదమ్మ. ఆ అద్దెడబ్బు కాస్త కట్టేశా. క్రొత్త కాపరం ఏం వెలగపెటతారో బస్తీలో అని, మా ముసలమ్మను కూడ పతిపావాళ్ళతో. ఇట్టేవారం గడిచిందోలేదో ముసలమ్మకు జబ్బుగావుందని వుత్తరం. అప్పుడప్పుడే నురుగులు కక్కుకుంటూ వెళ్లా. నేను వెళ్ళేటప్పటికి కోడలమ్మ మంచంమీదపడుకుంది-ఆ రాత్రినుంచి తల కాయ నొప్పిట. ముసలమ్మ మూలుగుతూ ఓ మూల పడుకుంది. అబ్బాయికేమో ఆఫీసు. పిలిస్తే పలికే దిక్కులేదు. ఇదేమన్నా మనవూరా యెవరోకరు వచ్చి యింతవుడకేసి పెట్టేందుకు. తల్లిఅన్న తర్వాత తప్పుతుందా? వాడు యివ్వాళ నువ్వేమి చేశావు అని అడిగాడుకాని! రాయంటిబిడ్డ, లక్క అంటి తల్లి అని చచ్చినట్టు వాళ్ళిద్దరుకు వుపచారంచేస్తూ అట్లా వారంరోజులు గడిపా. ముసలమ్మ కొంచెం కోలుకుందికదా అని యిట్టే యింటికివస్తే మళ్ళీ వెంటనే టెలిగ్రాం ముసలమ్మ చచ్చిందని. అదేమి శతృత్వమో నేను అక్కడ వున్నంతవరకూ బాగానే వుంది. మళ్లా ఆ బండిలోనేవెళ్ళా. ఎవరికోసం! అంతచెయ్యబట్టే యివ్వాళ యిట్లా అంటున్నాడు. ఇక ఆ యిల్లు చూడాలి పగవాళ్లకుకూడ వద్దమ్మ ఆ బాధలు. ఆ గదిలోనేపోయింది. నక్షత్రము మంచిది కాదు పాడుపెట్టాలన్నారు. వాణ్ణి హోటల్లో ప్రవేశించమనిచెప్పి, కోడలను యింటికి తీసుకొచ్చా. ఇన్ని విధాల కష్టపడ్డానమ్మ. నాకు యింకెవరున్నారు యీ కొడుకు కోడలేగదా అని. ఇంతచేశానే తల్లి అనే విశ్వాసం యేమైనావుందీ వాడికి కించిత్తయినా. ఇప్పుడు చిల్లిగవ్వకు పనికిరాకుండాపోయినాను. వారు ఆ నాడు భద్రాద్రి వెళ్లుతూ అన్నమాటలు యీ నాడిలాగ వుంటాయి. "తాతగారి తద్దినము వస్తోంది. వూళ్ళో బ్రాహ్మణులకు చెప్పిపోతున్నాను. మినపపప్పు, పెసరపప్పు తయారుచెయ్యి. తద్దినము రెండుమూడురోజులు వుందనగానే వస్తాన్లే. ఇల్లు జాగ్రత్త. నేను వెళుతున్నా"అన్నారు. తర్వాత తద్దినానికి రాకపోతే నాకు అనుమానంవేసింది. నెల రోజులకు "ఇంకేముంది అత్తా కొంప మునిగింది, మామయ్యను కొట్టి చంపారు భద్రాద్రిదార్లో." అని మా మేనల్లుడువచ్చి చెప్పేటప్పటికి నిలువునా కూలబడిపోయినా. అప్పటికి రాజశేఖరం నాలుగు నెలల వాడు. నాలుగునెలల దగ్గరనుంచి, మొగుడుపోయాడనే దుఃఖంలో యెన్ని కష్టాలు పడ్డానో, యెంత చాకిరిచేశానో ఆ భగవంతునికెరిక. కొంతకాకపోతే కొంతైనా ఆ దుర్గమ్మకు తెలుసు. ఈ నాటికి కొడుకు, కోడలు, మనమలు, మనమరాళ్లు అంటూ యేర్పడితే నేను దమ్మిడీకి పనికిరాకుండాపోయినా. వచ్చిన కష్టము రానేవచ్చింది. ఇప్పుడు వీళ్లను చూశన్నా సంతోషిద్దామనుకుంటే యిట్లా తయారయ్యాడు. ఇక నాజీవితానికి సుఖం యేముంటుంది అంటూ తన గోడంతా ప్రక్కయింటావిడతో యేకరువుపెట్టింది కావమ్మ.

ఇంతలో నాన్నవస్తున్నాడు అని సుభద్ర వాకిట్లోనుంచి గభాలునవచ్చి చెప్పటంలో కాలు మెలికపడి క్రిందపడింది. కొంచెం నెత్తురుకూడ వచ్చింది. కావమ్మ, మనుమరాలిని లేవదీయటానికి వెళ్ళితే 'నువ్వేమి చెయ్యక్కర్లేదులే' అని కసురుకుంటూ రిక్షాలో యెక్కించి తీసుకుపోయాడు రాజ

శేఖరం కూతుర్ని. కావమ్మ దుఃఖాన్ని ఆపుకోలేక గదిలోకి వెళ్లి ఓ చాపమీదపడుకుంది. కోడలు యెంత బ్రతిమాలినా అన్నంతినలా ఆనాడు. అత్తగారంటె అమితప్రేమ భరణికి అందులో మేనత్తేను, పాపం యేంచేస్తుంది. మొగుణ్ణి యెదిరించి నెగ్గగలదా తల్లే నెగ్గలేకపోతే! 'అత్తయ్య అన్నంతినటంలేదు, మీరు చెపితేగాని తినరుట' అని పెళ్ళాం అంటే పట్టుబలవంతంమీద 'ఏమిటమ్మా అన్నం తినటం లేదుట; యిదెక్కడ గొడవ. నీకు కావాలసింది చేసిపెట్టుతుంది తిను. ఏయ్, నువ్వు సరిగ్గా చెయ్యటం లేదా' అని పెళ్లాంవైపు తిరిగి అన్నాడు రాజశేఖరం. ఆ మాటలు వినంగానే గభాలునలేచి, ఆ మాటలతో కడుపునింపుకొని, కొడుకు దగ్గరకువచ్చి కూర్చుంది కావమ్మ. తాత్కాలికంగా రాజశేఖరం మనస్సుకరిగినట్లనిపించింది. భరణిముఖం చేటంత అయింది.

కావమ్మ మళ్లీ రాజశేఖరంతో మొదలు పెట్టింది. 'దేవుని దయవల్ల సుభద్రకు పన్నెండేళ్లు వచ్చినాయి. పెళ్లిచేస్తే నేనుచూసి సంతోషిస్తా. నేను పెద్దదాన్ని అయినానా' అంది.

'పిల్లల విషయం యెత్తొద్దని నీకు అనేకసార్లు చెప్పాను. ఇది ఆఖరిసారి చెప్పటం. నీకు కావలసింది యింత అన్నం. ఆ అన్నం కాస్తతినిపడివుండు. అంతేకాని అదిచెయ్యి యిదిచెయ్యి అని నువ్వేమి చెప్పక్కర్లేదు. మొన్న పారిజాతను బళ్లోకి వెళ్లద్దన్నావుటగదా అది లెఖలు చెయ్యటలేదు. నీ మూలాన పిల్లలు చెడిపోతున్నారు. పిల్లలజోలి నీకేమి అక్కర్లేదు. వాళ్ల బాగోగులునావి. ఎట్లా చెయ్యాలో నాకు తెలుసులే' అంటూ మామూలు ధోరణిలోనే కసురుకున్నాడు రాజశేఖరం తల్లిని.

ఈ సారి కావమ్మకు పట్టరాని కోపము, అహంకారము వచ్చింది. ఇక వూరుకోలేకపోయింది. "పిల్లల్ని చెడకొట్టావు పిల్లల్ని చెడకొట్టావు అనిచాలా సార్లు అంటున్నావు. నీ పిల్లలు అంత ముద్దైతే నెత్తిన యెక్కించుకో యెవరికిపట్టింది. నన్ను ఆజ్ఞలో పెట్టటానికి నువ్వేవడివి. మనిద్దర్ని ఆజ్ఞలో పెట్టేవాళ్లు పోనేపోయారు. నా ఆజ్ఞ నీకే లేకపోతే, నీ ఆజ్ఞ నాకేమిటి? గుడ్డొచ్చి పిల్లను వెక్కిరించినట్టు - ఛీ! అవతలకుపో!" అని చకచక గదిలోకిపోతుంటే చేతిలో వున్న గ్లాసును విసిరివేశాడు "నాయింట్లోనుంచి వెళ్లిపో" అంటూ రాజశేఖరం తల్లిమీద. అయ్యో అంటూ తటాలున భరణి అడ్డం వచ్చింది. ఆ గ్లాసు దెబ్బ భరణి ముఖాన తగిలింది. పెద్దబొప్పె కట్టింది. ఆ బొప్పెను చేతితోరాకి, 'అయ్యో యింత దెబ్బ అత్తయ్యకి తగిలేదే నేను అడ్డం రాకపోతే' అని అత్తయ్యను కౌగలించుకొని యేడ్చింది. 'నువ్వెందుకు అడ్డంవచ్చావు అమ్మ, ఆ దెబ్బ నాకు తగిలితే వాడి కళన్నా తీరేది' అని కన్నీరు కార్చింది కావమ్మ, కోడలి జుట్టు నిమురుతూ. ఓ మూల తల్లికి దెబ్బ, తండ్రి కోపంగా వుండటం, మామ్మ విచారం చూసి అప్పుడే బళ్లోంచివచ్చిన సుభద్ర బావురుమంది. అక్కయ్య వెంబడి యింట్లో నలుగురు పిల్లలు శృతి పట్టారు. కొంపంతా రోదనము. 'ఈ కొంపలో నేను వుండలేను మీరే వుండండి' అంటూ రాజశేఖరం చివాలునలేచి వుత్తరీయం బుజానవేసుకొని గడప దాటాడు. సుభద్ర 'నాన్నా! ఎక్కడికి' అని కెవ్వున కేకపెట్టింది. నాన్న అనే సుభద్ర పిలుపు రాజశేఖరం చెవుల్లో మారుమ్రోగిపోయింది. ఆ శబ్దం, పెద్దబరువుగల ఓ రాయిని తన గుండెమీద నుంచి తీసినట్లనిపించింది. ఆ నాన్న అనే అమాయకపు పిలుపులో తన హృదయము చిగిర్చి పుష్పించి, ఫలోన్ముఖం అయింది. ఆ పిలుపు తన పితృత్వాన్ని పులకరింపచేసింది. ఆ నాన్న అనే శబ్దతరంగాలు తన ప్రతివక్కనాడిలో ఓలలాడి, గుండెదగ్గర యేదో రహస్యము చెప్పినట్లనిపించినాయి. ఆ నాన్న అనే శబ్దం తన ముందు ఒక పెద్ద అఖాతము త్రవ్వింది. ముందుకు వెళ్లటానికి వీల్లేదు. ఆ నాన్న అనే శబ్దంలో ఓ అనంతమైన వెలుగు ప్రస్ఫుటంగా గోచరిస్తోంది. తన నాలిక యెక్కువసేపు మౌనం వహించలేకపోయింది. అమ్మా అని ఓ వెర్రికేక వేసింది. తన హృదయాన్ని యిన్నాళ్లనుంచి ఆవరించిన తమస్సు యివ్వాళ తొలగినట్లనిపించింది. చీకటి

పోంగానే వెలుగు. ఆ వెలుగులో నల్లటి అక్షరాల్తో వున్నట్లు ఓ వాక్యము హృదయానికి స్ఫురించింది. 'సుభద్ర నీ కెంతో, నువ్వు నీ తల్లికి అంతకావా' అనే ఆ వాక్యాన్ని కన్నీటిధారతో చదివాడు. 'అమ్మా' అంటూ కావమ్మ కాళ్లమీదవచ్చిపడ్డాడు. క్షమించు అనేమాట అనటానికికూడ సిగ్గుపడుతోంది హృదయము. కావమ్మ వణుకుతూలే నాయనా అంది. 'నా యీ పాపపుకళ్ళు నీ ముఖం చూడలేవు. నేను చేసిన ప్రతి అపచారము క్షమించానంటేనే తలెత్తేది.' లేకపోతేలేదు' అన్నాడు పట్టి బిగువున. "నువ్వు చేసిందేముంది నిన్ను క్షమించటానికి - చిన్నతనం నాయనా తెలీదు. పెద్దదాన్ని నేను చెపుతున్నాగా లేనాయనా లే" అంటూ తన మాతృత్వాన్ని రాజ శేఖరం హృదయంలో వెదజల్లింది. రెండుచేతులు పట్టుకొని లేవదీసింది. ముప్పయి యేండ్లకు మళ్లీ అమ్మఒళ్లో రాజశేఖరం కూర్చున్నాడు.

జుట్టు నిమురుతూ "నీ సుఖమే నాసుఖం, మీ నలుగుర్ని చూసి సంతోషించటంకంటే నాకు యింకే ముంది. మీకంటే నాకు యింకెవరున్నారని! నువ్వు మాత్రం సుఖపడిందేముంది. నువ్వు సుఖపడకపోతే నాకు సుఖం వుంటుందా" నీ యేవేవో చెపుతోంది తల్లి. అమ్మ అని ఒక్కటేమాట వస్తోంది రాజశేఖరం నోట్లోనుంచి.

నాన్న అని సుభద్ర, పారిజాతవచ్చారు "మీ అమ్మవళ్లో! నువ్వు కూర్చున్నావుగా అనీ వళ్లో మేము కూర్చుంటా"మంటూ. 'రండి' అంటూ రెండుచేతులు జాపాడు. ధరణి ఆనందభాష్పాలు ఆస్మితవదనానికి వన్నె తెచ్చినాయి.



# తెనుగు రాజ్యం

శ్రీ తుమ్మలపల్లి సత్యనారాయణమూర్తి

తెనుగు రాజ్యమిది వచ్చింది!
తెనుగుల తేజము తెలిసింది.

"మద్రాసీ" లను పరంపరాగత
నిందనేటితో - పోయింది!
యెల్లదేశముల తెనుగువారమని
తెలుప నక్కఱిక - తీరింది -

తెనుగు సింహమగు - టంగుటూరి మన
తెనుగు సీమనిక - పాలించున్!
తెనుగు మోమునకు - విన్నదనమిక,
యెన్నడుండదని - తేలింది -

తేట తెనుగులో - తెలుసుకున్న, ఓ!
తెనుగు యువకుడా! - వినిపింతుర్,
తెనుగు గడ్డయిది - తెనుగురాజ్యమిది
తెగించి ముందుకు - సాగాలోయ్ -

తెనుగు లెచ్చటను - తలగియుండినా,
తెచ్చి, యొక్కచో, కూర్చాలోయ్!
తెనుగు చరితకు - తెనుగు భాషకు,
తీయదనము - లింపొందాలోయ్ -

తెనుగు దేశమున్న - సిరులు సంపదలు
పరంపరలుగా - వర్ధిల్లుర్ -!
తెనుగు సాహసము - తెనుగు ధైర్యమును
తెనుగు యువకులిక - చాటాలోయ్ -



# కోడలి సత్యాగ్రహం

శ్రీమతి క. లక్ష్మి

ఆ రోజు ఆఫీసునుండి రోజూకంటే ఆలస్యంగా వచ్చేడు శేఖరం. ఆఫీసులో రోజూకంటె రెండు గంటలు ఎక్కువపని చెయ్యవలసివచ్చింది. ఇంటి దగ్గర తన భార్యలలిత ఒక్కర్తే ఉంది. భయపడు తోందో లేక తనమీద కోపమేవచ్చిందో అని అను కుంటూ మనస్సులో ఆఫీసును, తనను అంతసేపు కూర్చోబెట్టిన ఆఫీసరును తిట్టుకుంటూ తొందరగా సైకిలు త్రొక్కుకుని ఇంటికి వచ్చేడు. వీధి తలుపు తీసేఉంది. లలిత ఏంచేస్తోందో అని సైకిలును వాకిట్లోఉంచి వంటింటివైపు వెళ్లేడు. అక్కడ లలిత వంటంతా ముగించి దేముడిదగ్గర దీపంవెలిగించి ఆ భగవంతుడివైపు చూస్తూ పిచ్చిదానిలా అలాగే కూర్చుంది. ఆమె కళ్లమ్మట నీరు కారుతూ ఉండడం, దేనిని గురించో దీర్ఘంగా ఆలోచిస్తూ ఉండడం శేఖర్ గమనించనేలేదు. ఆమెకూడా అతని రాకను గుర్తించలేదు.

"ఇంకా వంట కాలేదా లలితా!" అన్నాడు.

భర్తమాట వినగానే తృళ్లిపడి కళ్ళు తుడిచేసుకుని చిరునవ్వుతో అతని కెదురుగా వచ్చింది లలిత.

"ఈ వేళ ఇంత ఆలస్యమైందేం. సావిడిలోకి పదండి కాఫీ పట్టుకువస్తున్నాను" అంది.

"నువ్వు మొన్న మొన్ననే మీఊరునుంచి వచ్చేవు. ఒక్కర్తెవూ ఉండలేవని పెందరాడే వద్దా మంటే ఆ ఆఫీసరు ఎంతకూ వదిలేడుకాడు. అక్కడకీ నువ్వు భయపడతావేమో అని తొందరగా పరుగెత్తుకువచ్చేను" అన్నాడు శేఖర్.

"ఆఫీసులో పనిఉంటే ఏంచేస్తారు. నాకోసం అంత తొందర ఎందుకు! ఎలాగో కాలక్షేపం చేసుకుంటాను. ఆఫీసుకంటే ఇది ఎక్కువా?" అంది లలిత.

"నాలలిత నాప్రాణానికి ప్రాణం. అన్నిటి కంటె ఎక్కువ" అన్నాడామె బుగ్గమీద చిటికె వేస్తూ.

భర్తకు తనమీదగల ప్రేమకు లలిత ఉప్పొంగి పోయింది. అతని మాటలకు ఆమె కళ్లు ఆనందంతో చెమ్మగిలేయి. కాఫీ కంపటిమీద పెట్టి ఆమె భర్త వెనకాలేవచ్చి బూట్లు విప్పింది. పేంటు, షర్టు, అన్నీ అందుకొని వంకీనవేసి అతనికి ధోవతి, బనియను ఇచ్చింది. శేఖర్ ముఖం కడుక్కుందుకు స్నానాలగదికి వెళ్లేడు. ఆమె వేడికాఫీతెచ్చి టేబిలుమీద పెట్టింది.

కాని ఆ వేళ ఎంత తెచ్చిపెట్టుకుందామన్నా ఆమెకు ఉషారు, సంతోషంరావటంలేదు. ఏదో ఒక బాధ, దీనత్వము కళ్లల్లో కన్పిస్తున్నాయి. ఆ రోజు ఇల్లు సర్దుతూంటే ఎక్కడో పెట్టె అడుగున తన కంటబడిన అత్తగారి ఉత్తరమే తన బాధకు కారణం. అది అత్తగారు తను ఊళ్లో లేనప్పుడు అతనికి వ్రాసినది. ముఖ్యంగా అందులో తనపై రాయబడిన నీచమైన నిందలుచూచి లలిత నిలువునా నీరైపోయింది. ఆమె మనస్సు మనస్సులోలేదు.

సరిగ్గా మూడుసంవత్సరాల క్రిందటనే లలితకూ, శేఖర్‌కూ వివాహమైంది. లలిత అమాయకురాలు. ఆమె హృదయం మెత్తని వెన్నలాంటిది. ఎటువంటి వారితోనైనా సరే స్నేహం చేసిందంటే ప్రాణమిచ్చి మాట్లాడుతుంది. హిందూ సంఘంలోగల మూఢ ఆచారాలను, పురాతన పద్ధతులనూచూచి కోతిం టికం, కట్నాలమోజు ఇలాంటి దురాచారాలుపోయి సంఘమెప్పుడు బాగుపడుతుందో అని విచారించేది. చిన్నతనమంతా 16 ఏండ్లవరకూ చదువులోనూ, పుస్తకాల మధ్యను, స్కూలులో ఫస్టుమార్కులు తెచ్చుకోవాలన్న పట్టుదల, సరదాలోనూ ఆమెకు తెలియకుండానే గడిచిపోయింది. స్కూలుఫైనలు పేసయి సంఘాచారాలు అడ్డుతగలటంచేత కాలేజీకి వెడదామనే ఉత్సాహాన్ని అతికష్టంమీద నిలుపుకుంది లలిత. చదువుకున్నప్పటికీ లలితకు భగవంతుని మీద నమ్మకమూ, భక్తీ చాలా ఎక్కువ. తరువాత తనకు వరుణ్ణి వెతకడంలో తల్లి తండ్రులు పడుతూన్న

కష్టాని, బెంగనూచూచి లలిత మనస్సులోనే కృశించి పోయేది. వరకట్నాలధరలు ఆకాశాన్నంటిన ఈ రోజుల్లో తన తండ్రి తనకోసం వేలు ఖర్చుపెట్టి పెద్దగ్రాడ్యుయేట్లను తేగలడా? తన తరువాత చిన్ని చెల్లెళ్లు, తమ్ముళ్లు వాళ్లగతి? పెళ్ళిచేసుకోకుండా చదువుకొని ఉద్యోగంచేసుకుందుకు సంఘం, కుటుంబ మర్యాద ఇవి అడ్డుతగులుతాయి. తల్లితండ్రుల బరువు తగ్గించడానికి ఏ పెళ్లికొడుకువచ్చినాసరే విద్య, ధనం, రూపం ఏమీచూడకుండా పెళ్ళిచేసేసు కోవడమే తన కర్తవ్యమనే తుది నిర్ణయానికి వచ్చింది లలిత. ఆ ప్రకారమే ఆమె శేఖర్‌ను వివాహం చేసుకొని తల్లి తండ్రుల బరువు వదిల్చింది. ఇతర విషయాలు ఎలాఉన్నా శేఖర్ యొక్క సుందర స్వరూపం, బుద్ధిచూచి లలిత వెంటనే అతనిని పెళ్లి చేసుకుందుకు అంగీకరించింది. తియ్యటి ప్రేమను, శాంత మైన స్వభావాన్ని వెలిబుచ్చే అతని అందమైన ముఖమే ఆమెను ఎక్కువగా ఆకర్షించింది. శేఖర్ కూడా లలితయొక్క కళకళలాడే ముఖము, విశాల మైన పెద్దకండ్లు, అమాయకమైన ఆ చూపులు వీటిచే ఆకర్షించబడి ఆమె తల్లి దండ్రులు ఇచ్చిన తక్కువ వరకట్నానికే ఆమెను వివాహంచేసుకొని దూరంగా తను ఉద్యోగంచేస్తున్న పట్నంలో కాపురం మొదలుపెట్టేడు. ఒకరి మనస్సు వేరొకరు బాగా అర్థంచేసుకొని అనుకూలమైన అన్యోన్య దాంపత్యం సాగిస్తున్నారు లలితా శేఖర్‌లు. భర్త ప్రేమ అనే అమూల్యనిధి తనకు లభించిందని ఆమె మురిసిపోతూ ఉండేది. అతనికి పెద్ద ఉద్యోగంగాని, విశేషంగా ఆస్తిపాస్తులుగాని లేకపోయినా, తన్ను అల్లారు ముద్దుగా పెంచిన తల్లిదండ్రులకు దూరమైపోయినా ఆమెకు విచారంలేదు. శేఖర్ యొక్క తియ్యటి మాట, చల్లనిచూపు ఇవే ఇప్పుడామె జీవితానికి ఆధారములు. తను ప్రార్థించినట్లుగానే భగవంతుడు గుణసంపదగలిగిన భర్తనిచ్చేడని ఎంతో మురిసిపోయి ఎన్నో నమస్కారాలుచేసేది. ఆ ప్రేమలో ఎటు వంటి ఆటంకంవచ్చినా ఎవరు విఘాతం కల్గింప జూచినా ఆమె సహించలేదు. అప్పుడు తన బ్రతుకే వ్యర్థం.

౨

రెండు నెలల క్రితమే లలిత తన చెల్లెలి పెళ్లికొరకని పుట్టింటికి వెళ్లింది. సెలవు దొరకకపోవడంచేత శేఖర్ లేకుండా ఒంటరిగానే వెళ్ళింది. కాని ఆ రెండు నెలల వియోగం అటు శేఖర్‌కూ ఇటు లలితకూ కూడా దుర్భరమైపోయింది. తల్లిదండ్రులు ఇంకా కొన్ని రోజులు ఉండమని బలవంతంచేసినా వినక ఆమె వెంటనే బయలుదేరి వచ్చేసింది. "ఇంక నిన్నువిడిచి నేనుండలేను లలితా? నువ్వులేకపోతే ఇల్లు శూన్యంగా కన్పించింది నాకు" అన్నాడు శేఖర్ ప్రేమతో.

అతన్ని విడిచి ఒంటరిగా ఎప్పుడూ పోకూడదని ఆమెకూడా అనుకుంది. ఆ రోజు ఇల్లంతా సవరిస్తూ భర్త పెట్టెలో బట్టలు దులుపుతూఉంటే ఆ ఉత్తరం క్రిందపడింది. అత్తగారు రాసినదేకదా, దాంట్లో ఏమిఉంటాయనే ఉద్దేశంతో ఆమె దానిని విప్పి చూసింది.

... అబ్బాయిని ఆశీర్వదించి వ్రాయునది ...

నువ్వు కులాసాగా ఉన్నావనుకుంటాను. ఇక్కడంతా క్షేమం. లలిత ఇంకా రాలేదా? నువ్వు ఆ హోటలు భోజనంతో ఎన్నాళ్లు ఇబ్బందిపడతావు? ఆ రాణీగారు ఇంకా రాదా? చదువు కున్నపిల్ల అని నువ్వు ఊరికే మోజుపడి చేసు కున్నావు. నేను చెప్పిన మంచి సంబంధాలు తోసేసేవు. వాళ్ల వాళ్లకు పరువు ప్రతిష్టలులేవు. దాని గుణం మంచిదికాదని నాకు తోస్తోంది. జాగ్రత్తగా కనిపెట్టి మసులుకో. చదువుకొన్నవాళ్లు తిన్నగా కాపురం చెయ్యరు. నువ్వు దానివల్ల ఏమి సుఖపడుతున్నావో తెలియదు. నీకు [illegible]ముషంలో రత్నంలాంటి పిల్లనివ్వడానికి ఎందరో సిద్ధంగా ఉన్నారు. నువ్వు దాని పైపై మెరుగులు, తీయటి

మాటలుచూచి వలలోపడకు. పైకి అలా అమాయకురాలిలా కన్పిస్తుందికాని లోపల చాలా గుణాలున్నాయి. ఈ ఉత్తరం దానికి చూపించకు.

మీ అమ్మ

ఆ ఉత్తరంలోని ప్రతీమాట లలిత లేత హృదయాన్ని వెయ్యి రంపాలలో కోసేసింది. అతి సున్నితమైన ఆమె మనస్సు ఒక్కసారి కృంగిపోయింది. అత్తగార్కి తనమీద ఇంతటి నీచమైన అభిప్రాయాలున్నాయని ఆమెకు ఇంతవరకూ తెలియదు. అందుకు తనుచేసిన నేరమేమిటోకూడా ఆమెకు తెలియలేదు. ఆమె లేతమనస్సులో పరిపరివిధాలైన ఆలోచనలు దొర్లిపోయేయి. "చదువుకున్న పిల్లను మోజుపడి చేసుకున్నావు" అని అత్తగారు రాసేరే? చదువుకోవటమే తనుచేసిన పెద్దనేరమా? లోకజ్ఞానం కోసం చదివిన చదువు దాంపత్య జీవనంలో బాధగా పరిణమించిందా? 'చదువుకొన్నపిల్లలే జ్ఞానంతెలిసి చక్కగా తమ సంసారాని దిద్దుకోగలరనీ, చదువుకున్నంతే మాత్రాన కాపరం వదిలేసి లేచిపోతారనుకోవడం వట్టి భ్రమ' అనే ఒక నీతిని తన సత్ప్రవర్తనద్వారా లోకానికి చాటాలని తను ఎంతో అణకువగా అందరికీలొంగి మసులుకుంటూందే?' చిన్నప్పటినుండీ బుద్ధిలోనూ, గుణంలోనూ అందరిచేత ఎంతో మంచి అనిపించుకున్న తనకు అత్తగారిచేత 'బుద్ధి మంచిదికాదని తోస్తోంది' అనే నీచమైన మాట పడవలసివచ్చిందే? అబ్బ! ఎంత అవమానకరమైన విషయం? పెళ్ళికాగానే అందరూ ఇలాగే అత్తవారి దృష్టిలో ఇలాగే చులకనైపోతారా? లేక తనేనా? తన ప్రవర్తనలో ఏలోపంచూచి తన భర్తకు ఇలా హెచ్చరిక చేస్తున్నారు? తను ఎరిగి ఉన్నంతవరకు ఏనేరం చెయ్యలేదే? చేసినా తన ఎదురుగాచెప్తే దిద్దుకొని ఉండదా? తను ఊళ్ళో లేనపుడు వారికి రాయడందేనికి? వారు తనపై అతి ప్రేమగా ఉంటున్నారని ఇలా రాసేరా? దీనివల్ల వారికి తనపై ప్రేమ తగ్గిందా? కాని తను ఊరి నుండి వచ్చేకకూడా వారు మునుపటిలాగే ఎంతో ప్రేమానురాగాలతో తనను లాలిస్తున్నారే! కాని తనపై ఏఅనుమానమూ లేనప్పుడు స్వయంగా ఉత్తరం చూపించి జరిగిన సంగతి చెప్పరాదా? ఎందుకంత భద్రంగా దాచేరు? వారిప్రేమలేకుండా తను బ్రతుకగలదా? అసంభవం? బ్రతకడంకూడా వ్యర్థం? అబ్బ! ఇంతకూ ఇటువంటి నీచమైన లేనిపోని మాటలురాసి తన్ను బాధ పెట్టడంతప్ప ఆవిడకు వచ్చిన లాభం ఏమిటి? ఈ 'అత్తరికాలు' ఇంకా ఇలా ఎన్ని తరాలు సాగాలో ఏమిటో? ఇన్ని మాటలుపడి ఇలా బాధ పడ్డానికి ఇంతకూ అసలు తను చేసిన నేరమేమిటి?" ఇలా అనేక విధాల ఆలోచనలలో దొర్లిపోతూ పరిపరి విధాల తన మనస్సును ప్రశ్నించుకొని పరీక్షచేసుకుంటోంది లలిత. తన గోడు వినేందుకు, తనకు సమాధానంచెప్పి శాంతి పరిచేందుకు తన అంతరాత్మ, మనస్సుతప్ప మరెవ్వరూ దగ్గరలేరు.

"ఒక ఆడపిల్లనై పుట్టి, ఒక యింటికోడలు కావటమే నువ్వుచేసిన పెద్దనేరం" అని ఆమె ఆత్మనుండి సమాధానం వచ్చింది.

తృప్తిపడి లలిత తిరిగి ప్రశ్నించుకొంది.

"దీనికి కారణం ఏమిటి? భర్తలచేతనో, అత్త ఆడుబిడ్డలచేతనో ఈ దేశంలోని కోడండ్రందరూ ఇలా బాధలుపడుతూ ఉండవలసినదేనా? దీనికి అంతం లేదా?"

"ఇప్పుడు నువ్వు పడుతూన్న బాధలేమిటి? నీ భర్త నిన్ను ప్రేమగా చూస్తున్నాడు. ఇంకా నీకు కావలసినదేమిటి?" సమాధానం.

"నామీద అత్త ఆడుబిడ్డలకు ఇటువంటి నీచమైన అభిప్రాయాలు ఉండడం మనస్సుకు తీరనిబాధ కాదా? లేనినిందపడేకంటే చావు మేలుకాదా?"

"ఇంతలోనే చచ్చిపోతావా? చదువుకున్నందుకు నీ బుద్ధి ఏమైంది? వెనుకటి మన పురాణగాధలన్నీ జ్ఞాపకం తెచ్చుకో? సతీ సక్కుబాయి, భక్తగౌరి, వీరరాజమ్మ ఎన్నెన్ని బాధలుపడి అలాగే కాపురం చేసి కీర్తి ప్రతిష్టలు పొందేరో? నీలాంటివాళ్లు

ఇప్పుడింకా ఎందరు ఎన్నెన్ని బాధలు పడుతున్నారో? అందరూ చచ్చిపోతున్నారా? ”

“మరి ఈ సమస్య తీరడ మెలాగ? ఈ భారత దేశంలోని కోడళ్లు తరతరాలుగా ఇలాగ బాధపడ వలసిందేనా? దీనికి అంతములేదా? ఇప్పుడు తీస్తున్న ఈ సినీమాలు చూసైనా అత్తగార్లు నీతి నేర్చుకోరాదా? నేనేవిధంగా సత్యాగ్రహంచేసి అత్తగారి మనసు మార్చగలను? ”

“అత్తగారుకూడా తనుకూడా ఒకప్పుడు కోడలినేనని, తనుకూడా ఒకప్పుడు ఇలా బాధలుపడి అనుభవించేననీ జ్ఞాపకముంచుకోవాలి. అప్పుడే కోడళ్లను కూడా తన కూతుళ్లలాగా చూచుకోగల్గుతుంది. రేపు నువ్వొక అత్తగారివై, నీ కోడలువస్తే నువ్వు అలాగే ప్రవర్తిస్తావేమో” అంది మనస్సు జవాబుగా.

“చెయ్యను. ముమ్మాటికీ చెయ్యను. ఇంతగా బాధపడుతున్న నేను తిరిగి ఇలాగే ప్రవర్తిస్తానా? ఎప్పటికీ అలా ఉండను” అనుకొంది అమాయకురాలు లలిత.

“నీలాగే అందరూ అనుకొని మాట నిలబెట్టుకొన్నట్లైతే ముందుతరంనుంచీ ఈ అత్తాకోడళ్లగొడవలే ఉండవు” అంది ఆత్మ.

“నాభర్తకు నామీద విశ్వాసముందా? ” అని లలిత ఈ విధంగా ఆలోచనా ప్రవాహంలోపడి కొట్టుకొనిపోతూన్న సమయంలో బైట సైకిలుగంట వినిపించింది. తృళ్లిపడి ఆమె వెంటనే భర్తకు తలుపు తెరవడానికి వెళ్లింది.

## 3

“నీ వంట్లో కులాసాగా లేదా లలితా? ” అన్నాడు శేఖర్ ఆ రాత్రి తనకు కాళ్లుపడుతూన్న లలితతో.

“ఏం? కులాసాగానే ఉన్నాను? అలా అడుగుతున్నారేం? ”

“కొద్దిరోజులనుంచీ నీ మొహంలో ఏదో దిగులు కన్పిస్తూంది. మునుపటిలాగా ఎప్పుడూ నవ్వుతూ సంతోషంగా ఉండటంలేదు?

మీవాళ్లకోసం బెంగపెట్టుకున్నావా? ”

“నేను ఏమైనా అన్నానా? ”

“నీకు ఇక్కడ బాగులేదా? ”

లలితకు దుఃఖము పొర్లుకు వస్తోంది. భర్తయొక్క అపారప్రేమకు ఒక వైపున సంతోషము, జరిగిన దానికి దుఃఖమూ రెండూ వస్తున్నాయి. తన కళ్లల్లోని నీరు చూడకుండా ఉండాలని ఆమె ముఖము ప్రక్కకు త్రిప్పుకొంది.

ఏదో పెద్ద విషయమే ఉందనుకొని శేఖర్ వెంటనే లేచి కూర్చున్నాడు.

“ఛీ! ఇదేమిటి లలితా? ఏడుపు! నీ మనస్సులో బాధ ఏమిటో నాతో చెప్పు. వెర్రిదానా! అన్నింటికీ నీకు నేనున్నానుగా. ఏడుపెందుకు? చెప్పు? ” అని లలితను దగ్గరకు తీసుకొని బుజ్జగించాడు.

“మీకు నామీద విశ్వాసముందా? చెప్పండి ముందు. ” అంది దుఃఖాన్ని ఆపుకొని.

“అదేమిటి లలితా! అలాగ అడుగుతున్నావు? విశ్వాసమేమిటి? ”

“ముందు చెప్పండి? ”

“ఎందుకులేదు? నువ్వంటే నాకు ప్రేమలేకపోవటమేమిటి? ” అన్నాడామె చెక్కిలి నొక్కుతూ.

“మీరు నావల్ల సుఖపడటంలేదనుకుంటాను” అంది మెల్లిగా.

అతను తృళ్లిపడ్డాడు. “అదేమిటి? ఆ మాట ఎవరన్నారు? ”

“అత్తగారే! మీకు రాసేరుగా ఉత్తరంలో.” ఒక్కసారి బావురుమంది లలిత శేఖర్ చేతుల్లో వాలిపోయి.

కొన్ని రోజుల క్రిందట తల్లి తనకురాసిన ఉత్తరం సంగతి జ్ఞాపకంవచ్చింది శేఖర్‌కు. దానిలోని సంగతులు అతను అప్పుడే మర్చిపోయేడు. అలాటి నేరాలు, గొడవలు అతను ఆట్టే మనస్సుకు పట్టించుకోడు. భగవంతు డిచ్చినంతలో సుఖంగా, తృప్తిగా బ్రతుకుతూ హాయిగా కాలంవెళ్లబుచ్చాలనే జీవిత లక్ష్యం అతనిది. లలిత అమాయకత్వం, జాలిగుండె, తన కష్టసుఖాలలో మనస్ఫూర్తిగా పాల్గొంటూ సంతోషను కల్గించే ఆమె నిష్కల్మషప్రేమ ఇవన్నీ చూచి శేఖర్‌కు లలిత అంటే అమితమైనప్రేమ. తన జీవితానికి సరియైన ధర్మచారిణిని ప్రసాదించిన భగవంతుని కృపను అతను ఎప్పుడూ తలచుకొంటూ ఉంటాడు. కాని అమెకు పౌరుషం, అభిమానం చాలా ఎక్కువనీ, ప్రతీ చిన్నమాటకూ మనస్సు ఎక్కువగా బాధపెట్టుకుంటుందనీ అతనికి తెలుసు. అందుకే తన తల్లిరాసిన ఉత్తరంచూస్తే ఆమె రాత్రింపగళ్లు మనస్సు పాడుచేసుకొని మంచమెక్కుతుందని ఎక్కడో పెట్టిలో అట్టఅడుగునవేసేడు. కాని అది ఆమె కంటపడనేపడింది. అతను అనుకున్నంతా అయింది.

శేఖర్‌కు తన తల్లి స్వభావం తెలుసు. ఆమె ఎప్పుడూ ఎవర్నో ఒకర్ని ఏదో ఒకటి అంటూనో, అలాంటి ఉత్తరాలు ఏవో రాస్తూనో ఉంటుంది. అందువల్ల ఏమిటి ప్రయోజనంఅన్న సంగతి ఆమె కక్కరలేదు. అందుకే అతను తల్లి అనేమాటలను కొంచెంకూడా లక్ష్యపెట్టడు. లలిత చదువుకొన్నదగుటచేత అలాంటివాళ్లు సరిగా కాపురం చెయ్యరనీ, మూడువంతులు వాళ్లను నమ్మడానికి వీల్లేదనీ ఆమెకు కోడలుపై తగనికోపం. లలితవంటి సుగుణవతి తనకోడలవడం తన అదృష్టమని ఆమెకు తెలియదు. ఈ సంగతి ఇప్పుడు లలితకు నచ్చచెప్పడమెలాగ? లలిత తన ధోరణిలో ఏదో వాగుకుపోతోంది. "మీకు జ్ఞాపకంలేదుకాబోలు. మొన్న నేను మీ బట్టలన్నీ సర్దుతూంటే క్రిందపడింది. అందులో పెద్ద సీక్రెటు ఏముంటుందనే ఉద్దేశంతో చూచేటప్పటికి ఆవిడ అలారాస్తారని నేను కలలోకూడా ఎన్నడూ ఊహించనంత దుర్భరంగా ఉన్నాయి అందులోని సంగతులు. స్త్రీ జన్మకు సాధారణంగా దుర్లభమైన భర్త ప్రేమ అనే అమూల్య ధనం నాకు లభించిందికదా అని ఎంతో మురిసిపోతున్నానే. భగవంతుడు నా గర్వమణచడానికే ఇలా అనిపిస్తున్నాడా? మీ దయ, ప్రేమ లేకుండా నేను బ్రతకడం వట్టిమాట. మీరుకూడా నన్ను అనుమానిస్తున్నారా? లేకపోతే నాకు చూపించకుండా అది ఎందుకంత రహస్యంగా దాచేరు?"

ఆమె మాటలను మధ్యలో అడ్డుకొని అన్నాడు శేఖర్. "నువ్విలా అనవసరంగా బాధపడతావనే నేను ఎక్కడో పడేసేను. దాని సంగతి నేనప్పుడే మర్చిపోయేను. పెద్దవాళ్లు చాదస్తంకొద్దీ ఏదో అలా అంటూంటారుకాని దాన్ని లక్ష్యపెట్టేదెవరు? నువ్వు ఈ సంగతి మర్చిపోయి సంతోషంగాఉండు లలితా! నేనుండగా నీకు విచారమెందుకు?

మూడేళ్లబట్టి నా ముద్దులలిత ఎలాంటిదో నేనెరుగనా? నాలలిత లేకుండా నేను బ్రతుకగలనా? ఏదీ ... ఒక్క చిరునవ్వు."

అంత విచారంలోనూఉన్న ఆమె ముఖంమీద ఒక అపూర్వమైన మందహాసం వెలిసింది. భర్తయొక్క తియ్యటి మాటలచే తనదుఃఖం కొంతవరకు మరచిపోయింది. ఒక్కసారి తన విశాలమైన కళ్లెత్తి అతనివైపు ప్రేమగాచూచి సిగ్గుచే తలక్రిందికి దించుకుంది.

నారి పెదవులు కలిసేయి.

పదిరోజులుగా లలితకు తరచు జ్వరం కాస్తోంది. మామూలు జ్వరమేనని అలాగే తిరుగుతూంది. శేఖర్ మాత్రం లోలోపల చాలా భయపడుతున్నాడు. తన తల్లిరాసిన మాటలు మనస్సులో పెట్టుకొని ఆమె లోలోపలనే కుమిలిపోతూండడంవల్ల ఆ బాధే ఇలా జ్వరంగా పరిణమిస్తూందేమో అని అతని భయం. ఆ ఉత్తరం చూచింది మొదలు లలిత ముఖంలో పూర్ణమైన సంతోషం, ఆనందం అతను చూడలేదు. తనను

సంతోషపర్చడంకోసం పెదవులపై చిరునవ్వు తెచ్చి పెట్టుకుంటూన్నా కళ్లల్లో దీనత్వం, దిగులు స్పష్టంగా గోచరిస్తున్నాయి. తనకు చాలా ఆప్తుడైన ఒక డాక్టరును తీసుకువచ్చి చూపించేడు శేఖర్. డాక్టరు ఆమెను పరీక్షించిన తర్వాత ప్రత్యేకించి ఆమె శరీరంలో జబ్బేమీ లేదనీ, ఏదో బెంగచేత నరాలు నిస్సత్తువగా మారిపోయి జ్వరం రావటానికి కారణమౌతూందనీ, ఆమెను సంతోషంగా ఉంచడం ముఖ్యమనీ చెప్పి వెళ్లిపోయేడు. దీంతో శేఖర్ మరీ భయపడిపోయి తన తల్లి దండ్రులకూ, అత్తమామలకూ లలిత అనారోగ్యం సంగతి తెల్పుతూ అందరనూ రమ్మని ఉత్తరాలు రాసేడు.

"నీవరసేమీ బాగులేదు లలితా?" అన్నాడు శేఖర్ అప్పుడే కప్పుకొని పడుకున్న లలితతో. రాత్రిళ్లు జ్వరం విశేషంగా తగుల్తూన్నా తన భర్తకు కనపడనీయక అతనికి భోజనంపెట్టి, ఇంటిపనులన్నీ ముగించి పడుకుంది. భర్త మాటలువిని కళ్లెత్తి దీనంగా అతనివైపు చూసింది.

"నువ్వు నీ అంతట రోగాన్ని వృద్ధిచేసుకుంటున్నావు" అన్నాడు తిరిగి.

ఆమె మాట్లాడలేదు.

"నీ మనస్సులోని బాధ ఏమిటో చెప్పు?

ఇది కలియుగం. మనది మానవజన్మ. ఎన్నో కష్టనష్టాలను ఎదుర్కోవలసి వస్తుంది. ఇంత అబలవైతే ఎలాగ?

లోకంలో అత్తగార్ల చేతుల్లో దెబ్బలు తింటూన్నవాళ్లూ, ప్రాణాలు కోల్పోయిన కోడళ్లు కూడా ఉన్నారు. నీలాగ ఒక్కమాటకోసమే మంచమెక్కి ప్రాణం మీదకు తెచ్చుకుంటే అయినట్టే. మా అమ్మ అలాగ అందనేనా నీ బాధ? నేను మా అమ్మ రాగానే అంతా చెప్పి 'అంతా వట్టినే అలా రాసేను నీ మీద ఏ కోపమూ లేదని' అనిపిస్తాను. సరేనా? నామాటవిని అంతా మర్చిపో లలితా! నాకోసమైనా సంతోషంగా ఉండు" అంటూ శేఖర్ ఆమె నుదిటిమీద చెయ్యివేసి అంత దూరం త్రుళ్లిపడ్డాడు. వళ్లు సలసల కాగిపోతూంది. వళ్లు తెలియకుండాపడిఉంది లలిత. ఆమె హీనస్వరంతో "అత్తగారు ... మాట ... క్షమాపణ" అని పలవరిస్తోంది. డాక్టరు ఎంత ప్రయత్నించినా రోగం తీరు తెలియటంలేదు.

"శేఖర్ గారూ ఈ అమ్మాయికి ఇలా జ్వరం రావటానికి ఏదో గృహంలోని అంతరంగిక కారణాలు ఉండి ఉంటాయని అనుకుంటున్నాను నేను డాక్టరననే భావంకాక ఒక ఆప్త మిత్రుడననే సంగతి జ్ఞాపకముంచుకొని జరిగినదంతా చెప్పండి. మనం చెయ్యగల్గినదంతా చేసిచూద్దాము. ఆపైన మీ అదృష్టం" అన్నాడు డాక్టరు.

తన వివాహం జరగడం దగ్గరనుంచి జరిగిన గొడవంతా చెప్పి తన తల్లిరాసిన ఉత్తరం, అందులోని సంగతులు అన్నీ చెప్పుకువచ్చేడు శేఖర్. డాక్టరు వెంటనే కనిపెట్టేడు. "ఆ అమ్మాయిది అతిసున్నితమైన మనస్సు. ఏ పరిస్థితిలోనూ ఏ చిన్నకఠినమైన మాటనూకూడా సహించలేదు. ఆ ఉత్తరంలో అంత కటువైన విషయాలు కేవలం తనమీద కల్పించి రాయడంచే ఆమె మనస్సుకు బాగా బాధ కలిగింది. ముందు వెంటనే మీ అమ్మగారిని రప్పించండి. ఆమె వల్ల వచ్చిన ఈ జ్వరం ఆమె వల్లనే పోవాలి."

తన అవివేకానికి శేఖర్ ముందుగానే ఆ ఉత్తరం చింపేస్తే ఏ గొడవా లేకపోనుగదా అని చాలా చింతించేడు. లలితది ఎంత సున్నితమైన మనస్సు? దానికోసమే అంత బాధ పడుతోందా? తన లలిత తనకు దక్కుతుందా? అని అతని మనస్సు పరిపరి విధాలపోతూంది. అతని ఆందోళన గ్రహించిన డాక్టరు.

"శేఖర్ గారు అధైర్యపడకండి. ప్రమాదమేమీ లేదు. మీ అమ్మగారువచ్చి ఆదరంగా తన కుమార్తెలాగ చూచుకుంటే ఆమె మనస్సు శాంతించి కోలుకోగలదు" అని మందు ఇచ్చి వెళ్లిపోయేడు.

20 రోజులు గడిచేయి. లలిత జ్వర తీవ్రతతగ్గి నెమ్మదిగా స్పృహలోకి వస్తోంది. శేఖర్ తల్లి వచ్చింది. జరిగిన గొడవంతా మెల్లిగా వివరించి తల్లికి చెప్పేడు శేఖర్. "ఉత్తరంలో రాసిన దానికే ఇదంతా వచ్చిందంటావుట్రా - ఆశ్చర్యం కాక పోతేను. మేమెక్కడా ఎరగం? స్వతహాగా జ్వరం రాదలచి వచ్చిందేమో?" అంది శేఖర్ తల్లి. ఆశ్చర్యం పైకి ప్రకటిస్తూ, లోపల నిజంగా తను అలాటివన్నీ రాయకూడదని హడలిపోతూ. తల్లిని మెల్లిగా లలిత నిద్రపోతూన్న గదిలోకి తీసుకు వెళ్ళేడు.

"లలితా? లలితా? ఇలా చూడు. ఇదిగో మా అమ్మ ఊరినుంచి వచ్చిందిచూడు" అన్నాడు. అప్పుడే కొంచెం తెలివివస్తూన్న లలిత 'మా అమ్మ' అన్నమాటవిని కొంచెం కళ్ళు తెరచింది. ఎదురుగా అత్తగారు. ఒక్కటేచూపు చూచింది. దీనమైనచూపు "...నామీద మీకు కోపంపోలేదా? ఆయన ప్రేమ నాకు దక్కనివ్వరా? నేనేమి అపరాధంచేసేను?" అనే అర్థం ఆ చూపులో నున్నవి.

చిక్కి శల్యావశిష్టమై మంచానికి అంటిపెట్టుకు పోయిన కోడలుయొక్క కరుణాజనకమైనస్థితి, దీనమైన చూపు చూచిన అత్తగారి మనస్సు కరిగిపోయి ఆమెలోని సహజమైనప్రేమ పొంగివచ్చింది. చదువుకొని ఎంతో పొగరుగా ఉంటుందనుకొన్న కోడలంలోని యింత బేలతనముచూసి ఆమె కళ్లనీరు తిరిగింది.

"లలితా? ఎలా ఉంది?" అంది తలదగ్గర కూర్చొని.

"అత్త ... గా ... రూ? వచ్చేరా? నన్ను క్షమించరూ? అంది హీనస్వరంతో."

"పిచ్చిదానా! ఇంత బేలవైతే ఎలాగ? నువ్వు కూడా నాకుమాత్రెలాటిదానవు కాదూ! అందరినీ ఎంత కంగారు పెట్టేవు? నీ కోసం బెంగపెట్టుకుని అబ్బాయి ఎలా అయిపోయేడోచూడు. కాఫీ పెట్టి తెస్తాను. నువ్విక్కడ ఉండరా!" అని బయటకు వెళ్లింది.

అత్తగారి మనస్సు మారడంచూచి లలితలో బాగా వికాసం కన్పించింది. ఆమెకు బాగా తెలివివచ్చింది. ఆమె పరిస్థితిలో మార్పుకు శేఖర్ చాలా ఆశ్చర్య పడ్డాడు. అతనికి డాక్టరు మాటలు జ్ఞాపకంవచ్చేయి.

"లలితా!" అన్నాడు ఆమె చేతినిరాస్తూ.

ఒక్కసారి మెల్లిగా, తృప్తిగా అతనికేసి చూసింది 'అత్తగార్కి నామీద దయకల్గింది. నాకేం పర్వా లేదన్నట్టుగా.'

"లలితా! కోడళ్ళందరకీ అహింసాపూర్వకమైన ఒక కొత్తరకం సత్యాగ్రహం నేర్పేవు. అందులో నువ్వు ప్రప్రథమంగా విజయం సాధించేవు" అన్నాడు నవ్వుతో.

అతని నవ్వుతో ఆమె చిరునవ్వు కలిసింది. ఇంతలో అత్తగారు కాఫీ పట్టుకువచ్చేరు.

అప్పుడే వచ్చిన డాక్టరు లలిత భర్త చేతులమీద ఆని కూర్చుని, అత్తగారిచ్చిన కాఫీ త్రాగుతూండడం చూసి ఆమెరోగంలో త్వరితగతిని కలిగినమార్పుకు ఆశ్చర్యపోయేడు. మీరు చెప్పినట్టుగానే జరిగిందన్నట్టుగా శేఖర్ డాక్టరుకేసి చూచేడు.

"డాక్టరుగారూ! మాలలితకు ఇప్పుడెలాగుంది? చూడండి" అన్నారు అత్తగారు.

ఆమె నాడిని పరీక్షచేస్తూ అన్నాడు డాక్టరు "ఇప్పుడు సర్గా ఉందమ్మా! ఇంకేమీ ఫర్వాలేదు మీరు సకాలంలోవచ్చి ఆమెకు తిరిగిజన్మ ఇచ్చేరు. మీ అనురాగం, ఆదరం ఇవే ఆమె రోగాలకు మందులు. మా మందులుకూడా ఇటువంటి మనోవ్యాధులకు పనిచెయ్యవు. తన సత్యాగ్రహంద్వారా మీ ప్రేమనుపొంది స్త్రీ లోకానికే పాఠం నేర్పింది. మన్నించండి. ప్రతి స్త్రీ కూడా వివాహం చేసుకున్నాక అత్తవారింట్లో అందరి ఆదరణకూ పాత్రురాలు కావాలనీ, భర్త ప్రేమను పొందాలనీ సహ

జంగా కోరుకుంటుంది. ఆమె దానికి తగినట్లుగా ఎంత వినయంగా, అణకువగా మసలినా కూడా అవి పొందలేనప్పుడు, ఎదురుగా అపనిందలు భరించవలసి వచ్చినప్పుడు, ఆమెకు తన జీవితమే భారంగా తోస్తుంది. ప్రతీ అత్తగారూ, ప్రతీ భర్తా కూడా ఈ సత్యం తెల్సుకొని పైయింటినుంచి ఎక్కడనుంచో

అదృష్టవంతుడు" అని అనుభవశాలియైన డాక్టరు అసలు సత్యాన్ని బయటపెట్టి వెళ్ళిపోయేడు. అసలు రహస్యాన్ని చెప్పి తన లలితను బ్రతికించిన తన స్నేహితుడికి కృతజ్ఞత తెల్పడానికి వెనకనే వెళ్లేడు శేఖర్. అతని మాటలలోని సత్యాన్ని గ్రహించి సిగ్గుపడ్డారు అత్తగారు.



ఓదార్పు [illegible]

వచ్చినదని తలంచక ఆమెకుకూడా తమ ప్రేమ, అనురాగం పంచియివ్వగల్గిననాడు, ఈనాడు నిష్కారణంగా ప్రాణాలు కోల్పోతున్న జాతిరత్నాలైనటువంటి సోదరీమణులెందరో రక్షింపబడతారు. అమ్మా! మీ పశ్చాత్తాపమే సుగుణవతియైన మీ కోడలును రక్షించింది. నా మందులు కావు. శేఖర్

కుమార్తెకు ఎలా ఉందో అని ఆత్రుతగా బండి దిగివచ్చిన లలిత తల్లిదండ్రులు ఆమెకు కొంచెం కులాసాగా ఉండడం అత్తగారు దగ్గర కూర్చొని మందు ఇస్తూండడం చూచి ఎంతో సంతోషించేరు. ఒక్క ఆదరణకలిగిన మాటతోనే ఆమె జబ్బు తిరుగుముఖం వచ్చిందన్న సంగతి వారికేం తెలుసు?

# స్వార్థం

శ్రీమతి పి. జె. శాంతమ్మ

"అమ్మగారూ రేపు, పనికిరానండి సెల విప్పించాలి" అంది ఎంకి సిగ్గుతో తల వంచుకొని.

అమ్మగారి గుండెలో రాయిపడ్డట్ట య్యింది "ఏమే ? ఏం తెగులు ?" అంది కనుబొమలు ముడివేస్తూ అమ్మగారు.

ఆవిడను అందరు "అమ్మగారనే" పిలుస్తారులెండి. పేరేమిటోకూడా ఎవ్వరికీ తెలియదు. ఇంటినిండా డబ్బు మూలుగుతూ ఉంది. పిల్లాజల్లాలేరు. మరి ఆవిడ కుండే జబ్బువల్లనోగాని ఎప్పుడు మూలుగుతూనే ఉంటుంది. వంటావిడను పెట్టుకొంది. ఇక అన్ని పనులకు ఈ ఎంకే. దాది నౌఖర్లు దొరకని ప్రదేశంలో మధ్యాహ్నం భోజనంపెట్టి 8 రూ॥ ఇస్తుంది. చంద్రరావు గారి తొలిసంబంధంకు ఒక కుర్రాడు మాత్రమున్నాడు. పోనీ తనకు లేనేలేదు సంతానం, అని ఆ ప్రకాశరావునైన కడుపున పుట్టిన బిడ్డలాచూచుకొంటుందా ? అంటే వాడు ఇంట్లో ఉంటేనే ఆమె ఒంటినిండా జెర్రెలు తేలుకుట్టేస్తున్నట్లుంటుందట. ఎంకి ఈవిడ దగ్గిరకు వచ్చి ఆరు నెల్లయ్యిందట. ఈవిడకు నచ్చినట్లు తిరుగుతుంది. వెనకాల మెటికలు విరిచినా, పైకి చాలా వినయంగానే కనబడుతుంది.

పాపం ! ఎంకి తల్లిదండ్రులు పేదవాళ్లు. ఎనమండుగురు సంతానం. వాళ్లనాన్న పగలంతా కష్టపడి రెండు రూపాయిలు తెస్తాడు కూలి ఉన్న రోజుల్లో. లేనిరోజుల్లో పిల్లలను సముదాయించలేక వాళ్లమ్మ నూతిలోకూడ పడబోతే రెండుమార్లు రక్షించారు ఇరుగుపొరుగువారు. ఇప్పటికి రెండు సంబంధాలు వచ్చాయి ఎంకికి. అన్ని రైటైయ్యాక ఇలాగ అమ్మగార్ని సెలవడగడం, ఆవిడ సెలవియ్యకపోవడం, తప్పని సరి ముహూర్తపు రోజు వచ్చేసరికి "మీ పిల్ల మాకు నచ్చలేదు మేమురావడంలేదు" అని కబురు 'టెలిగ్రామ్‌లాగ' రావడం, అప్పుజేసి అమర్చి ఉంచిన పెళ్లి దినుసులన్ని వృధాగా అయిపోవడం. ఈ ఆరు నెలల్లోనే జరిగిపోయాయి.

ఈవేళ ఎంకి రేపటినుండి మూడు రోజులు తన పెళ్లిని గూర్చి సెలవడగ్గానే అమ్మగారికి వళ్లు తెలియనంత కోపం వచ్చింది.

"ఏమో ! నాకేమి తెలియదు నేను సెలవియ్యను. ఒకవేళ నాకు చెప్పకుండా మానేస్తే ఇకమీద మీ బాబుకు కూలి పనికూడా చెప్పను."

"అయితే నేను లేకుండా నా పెళ్లి

ఎట్లా జరుగుతాదండీ, అంది ఎంకి ఆరి పోయిన పెదాలతో''

''ఛీ! పాడుముండా! కూలిముండలకు పెళ్లేమిటే? ఫో! అవతలకి నా ఎదురు గుండా నిలబడకు—పెరట్లో ఆరేసిన చీరెలు తెచ్చి కుచ్చిళ్లెట్టు'' అంది అమ్మగారు.

పాపం ఎంకి పొంగివచ్చే ఆవేశం, దుఃఖం ఆపుకొని కళ్లమ్మట రెండు నీటిబొట్లు రాల్చి గబగబ చీరలు తేడానికి పోయింది.

రాత్రి 8 గం॥లకు ''అమ్మగారూ! సెలవు తీసుకొంటున్నానండి'' అంది ఎంకి చారు తపేళ అరిచేతిలో పెట్టుకొని.

''ఆ! వెళ్లు రేపు నేను కోవిలకెళ్తున్నా 6 గం॥లకే నీవు రావాలి సుమా'' అని హెచ్చరించింది.

''అమ్మగారు రేపు రానండి'' అంది ఎంకి తడబడుతూ''

''ఏమిటన్నావు రేపురాకపోతే నీయమ్మను పంపు. నీ చాకిరి అంత ఎవరు చేస్తాడను కొన్నావు'' అంది మంచం దిగి ఎంకి దగ్గిరగావచ్చి

''మా అమ్మలేకపోతే పెళ్ళివారినెవరు మర్యాదచేస్తారండి'' అంది అమాయ కంగా కళ్లు త్రిప్పుతో.

''ఏమిటన్నావు? నీ పెళ్లి పెడాకులై పోను! నువ్వురాకపోయి, మీ అమ్మరాక పోతే ఈ పనంతా ఎవరుచేస్తారు? అందులో ముష్టి పెళ్లికి మూడురోజులా? నేనొప్పు కోను.''

''పోనీ జీతం నాగా వెయ్యమన్నదండీ మా అమ్మ''

''నాగా! వేస్తాను ఉండు. ఆ పెళ్లిసంగ తేంటో కనుక్కొంటాను వెళ్లు, వెళ్లు, ఇంకా నిలబడ్డావేం, పో'' అని తలుపులు దబాల్న వేసుకొంది అమ్మగారు.

ఎంకికి ఒక్కసారి గుండెలో రాయి బడ్డట్లైయింది. కళ్లనిండా నీళ్లూరాయి, ఆ చిరుగు పైటకొంగుతో నీళ్లు వత్తుకొని కచ్చా క్రిందకులాగుకొంటూ ఇంటిముఖం పట్టింది. త్రోవలో రామం తాత పలకరించేడు ''ఏమే ఎంకీ! అంత దిగాలుగాఉన్నా'' వని పాపం ఎంకి ఒక్కసారి బావురుమంది కళ్లువత్తుకుంటూ. ''అరెరె! ఏటేసంగతి అట్లా ఏడుస్తున్నావు?'' అన్నాడు గాబరాగా. ''తాతా! ఒక మారు ఇంటికి రా అంతా చెప్తాను'' అంది దుఃఖందిగ మ్రింగుతూ.

''అయితేనడు నేను మీయింటికే ఒక మారు వెళ్దామని బయలు దేరాను.'' అన్నాడు ''ఎంకీ! ఎందుకే ఏడుత్తున్నావు'' అన్నాడు తాత జాలిగా ''ఉండు తాత ఇంటికాడ చెప్తాను గుండెల్లోగాబరాగ ఉంది''అంది కాస్త ఆయాసంగా''ఊహూ'' అని ఇక తాత ఏమిఅనకుండా ఊరు కున్నాడు. సరే ఇంటికి వచ్చారు ఇద్దరును.

రాగానే ఎంకి తల్లి! సోమమ్మ ఆతృతగా అడిగింది. "ఏమే! సెలవిచ్చిందా?" అని "లేదమ్మా" అంతలో తండ్రి అందుకొన్నాడు "ఏం? పాడుముండ ఆ పాటి సెలవియ్యడానికి దాని కొంప ఏంమునిగిపోంది. మరి పేదోళ్లకు పెళ్లిళ్లు జరక్కూడదన్న మాట" "ఉండరా! దాన్ని సంగతంతా చెప్పనీ, ఊ చెప్పే ఏమందో" అన్నాడు తాత కనుబొమలు ముడివేస్తూ. ఎంకి జరిగిన సంభాషణ అంతా చెప్పింది. ఆఖరుగా "ఉండు ఆ పెళ్లిసంగతేటో కనుక్కొంటాను అని అంది" అనికూడా చెప్పింది.

ఇక్కడ తాత "ఆగు. దాన్ని సెలవడగడం అది ఇయ్యక పోడం, ముందు ఇలాగే టకాయించడం ఆ రెండు సంబంధాలు సరిగ అమిరినవి ఆఖరుకు తప్పిపోవడంలో ఏదో ఈ పెళ్లిళ్లకు అమ్మగారికి సంబంధం ఉందని నా కనుమానంగా ఉంది" అన్నాడు. "ఛా! ఎంత పాపిష్టి ముండైన పెళ్లి చెడగొడతాదటయ్యా, తప్పు అది పని చేసులేక అలా ఏడుస్తాది" అన్నాడు ఎంకి తండ్రి సన్నాసి "ఒరే నోరుముయ్యి ఆ గొడ్డుముండా ఎంతమంది నోట్లో మట్టోసిందనుకొన్నావు నన్నడగరాదాని గుట్టుమట్టు. అది పాపిష్టిముండరా దానికి డబ్బే ప్రధానం. దాని మొగుడికైనా కడుపు నిండా కూడెట్టదురా"

"సరే యింతకు పెళ్లి మూర్తం ఎప్పుడు?" "సాయంత్రం గం|| 6-30."

"సరే నువ్వు ఎక్కడికి ఎల్లకే ఎంకీ ఈ పెళ్లి ఎలాగ అవదో నే చూత్తాగా–నా తడాకా" అంటూ చుట్ట ముట్టించుకొని "వత్తానే సోమమ్మా!" అంటూ లేచి వెళ్లిపోబోయాడు. "పెళ్లి కొడుకు వాళ్లు ఇప్పుడొత్తారు మామా! నువ్వు లేకపోతే ఎలా? ఈ రేత్రికి ఇక్కడే తొంగో" అంది. "చరే," ఆ తాత మెడమీదఉన్న చింకిపాత దండెమ్మీద వేసి నులక మంచమ్మీద కూర్చున్నాడు. అంతలో డప్పులు వాయిద్యం "అదుగో పెళ్ళివారు వత్తున్నారు" అంటూ అంతా లేచారు ఎదురు డప్పుల వాయిద్యాలతో పక్క వీధిలో ఉన్న మిద్దింట్లో విడిదికిదింపారు. అందరు పడుకొన్నారుగాని "తాత డిబ్బీ దీపందగ్గర చుట్టలు చుట్టుకుంటూ కూర్చున్నాడు." అందరు నిద్రపోయాక మెల్లిగా లేచి ఎక్కడికో వెళ్లాడు అమ్మగారి నౌఖరి తెల్లవారుజామున పెళ్లివారి విడిదికి వెళ్లాడు. ఆ టైముకు అందరు లేచి ముఖాలు కడుక్కుంటున్నారు. "ఓహో! ఏవూరు బాబూ మనది" అని పలకరించాడు పెళ్లి కొడుకుతండ్రిని. "మాది రాంబద్రపురమండీ మీరెవరండీ" "మీ కోడలుగారు నేను ఒక దగ్గిరే నౌఖరి ఉన్నామండీ" అన్నాడు తమాషాగా "అయితే ఆ అమ్మాయి చాలామంచి పిల్లటకదండి" అన్నాడు మరొకతను. "ఆ! చాలమంచిదండి బాబూ! వెయ్యిఅబద్ధాలాడైన ఒక పెళ్లి

చెయ్యాలన్నారు పెద్దలు. నా కెందుకు బాబూ! నాలుగు రోజుల్లో మీకే తెలుస్తాది ఆ మంచి'' అన్నాడు 'వాళ్ళలో అనుమానంపుట్టేలాగ కళ్ళు తాటిస్తూ. ''ఆ! అదేటో చెప్పగూడదండి'' ''అబ్బే మీతో నేనంటే మాత్రం నమ్మతారా? ఇది నాలుగోమాసం ఆ పిల్లకి దానిసంగతి తెలిసే ఇదివరకు రెండు సంబంధాలు పోయాయి. అయినా నాకెందుకు బాబూ ఒకరిగొడవలు'' అంటూ లేవబోయాడు. మరి ఇంత సేపు ఎక్కడ ఉన్నాడో గాని తాత, గబాల్న వాడి రెండుచేతులు వెనక్కి పట్టుకొని ఒక్కతన్ను తన్నాడు ప్రక్కలో. ''చచ్చాన్రోయి'' అని పడ్డాడు ఆ రంగడు, ''లం......కొడక ఎవరికిరా నాలుగోమాసం, చెప్పు వెదవనాగన్నా! చంపేత్తాను పేగులొలిచేత్తాను'' అంటూ ఎడాపడా దవడలు వాయించేస్తున్నాడు. అందరు చుట్టూమూగారు. తాతను పట్టుకొన్నారు గాని తాతవాళ్లను తోసేస్తున్నాడు; సింహగర్జన చేస్తున్నాడు. ఎలాగయితే కాస్తవాడికి తెలివి వచ్చేలాగు వేడిగంజీ అంతాపోసి లేచి కూర్చోబెట్టి సంగతంతా అడిగారు వాడు చెప్పడం మొదలు పెట్టేడు ''అమ్మగారు, ఎంకి లేకపోతే ఒక్కక్షణం సంసారం ఈదలేదట. అసలు ఈఊళ్లో సౌఖర్లు దొరకటం కష్టం. అందులో ఇది పిసినారి. దానికి పెళ్లయితే మొగుడితో కాపురానికిపోతాది. అప్పుడు ఇంత తక్కువజీతానికి ఎక్కువసుఖం ఇచ్చే నౌఖర్లు దొరకరట. కనుక ఆ వచ్చిన రెండు సంబంధాలను నేనే ఇలాచెప్పి వెళ్లగొట్టాను అమ్మగారి మాటమీద. వీళ్లని కూడా ఇలా వెళ్లగొడితే ఎంకికి ఇక పెళ్లి అవదు. అమ్మగారిదగ్గిర ఎంకి ఉంటుందని ఆవిడప్లాను'' అని పాపం బెక్కి బెక్కి ఏడుస్తూచెప్పేసాడు రామయ్య

''ఒరే అది ఇలా ఎన్నికొంపలు కూలదోస్తుందో! డబ్బుగలది గనుక కమ్ముకుపోతున్నాయి. నువ్వు మాలాటి పెద్దోడివి గదా ఈ కుక్క బుద్ధి నీకెక్కడ దాపరించిందిరా? దొంగనాయాలా! ఏమివచ్చిరదిరా? చెప్పు మళ్లా తగల్నిచ్చేదా ?చెప్పు మూడు రూపాయిలు చూసావా! ఇల్లాంటి ఘోర కార్యాలు చేయించేటప్పుడు సైతం అట్టేడబ్బు కర్చు పెట్టదు గొడ్డుముండ. పో! గాడిదా! మళ్లాఎప్పుడైనా ఇలాటి పనిచేస్తావా – పీక నులివేస్తాను తెలిసిందా'' అంటూ బయటకు ఒక్కతోపుతోసాడు తాత.








## గుమ్మడికాయ పచ్చడి

ఎఱ్ఱ గుమ్మడికాయ పైపెచ్చు తీసివేసి అందులోని గిజరును, విత్తనములను తీసివేయవలెను. కావలసినన్ని ముక్కలు తరిగి యుంచుకొనవలెను. బాణలిలో తగుమాత్రంగా నూనెపోసి పొయ్యిమీదనుంచి అందులో గుమ్మడికాయ ముక్కలు వేసి వేయించవలెను. ముక్కలు బాగా ఉడకగానే దించియుంచుకొనవలెను. కొద్దిగా జీలకర, ఆవాలు, మినపప్పు, సన్నగా తుంచిన ఎండుమిరపకాయలు బాణట్లోవేసి నూనెలో వేయించి సువాసనవచ్చు సమయమునదించి రోటనుంచి, అందులో వేయించియుంచిన గుమ్మడి బద్దలు, ఉప్పువేసి రుబ్బవలెను. రుబ్బునప్పుడు కొతిమేరాకు కూడ కొంత చేర్చినచో మరింత రుచిగానుండును.

యం. మాణిక్యాంబ

## దొండకాయల పచ్చడి

తియ్య దొండకాయల ముక్కలను నూనెలో మెత్తగా ఉడుకునట్లు వేయించియుంచుకొనవలెను. కొద్ది కొద్దిగా ఆవాలు, జీలకర, మినపప్పు, కావలసినన్ని ఎండుమిరపకాయలు తుంచి వేసినవి బాణట్లోవేసి నూనెలో వేయించి రోటిలో నుంచవలెను. అందులో కొద్దిగా చింతపండు పులుసు, కొతిమేరాకు, వేయించిన దొండకాయముక్కలు, ఉప్పువేసి రుబ్బివాడుకొనవచ్చును. ఇది రుచికరమే కాక ఆరోగ్యకరమైనది కూడాను.

చివుకుల లక్ష్మీనృసన్నయ్య

## టొమేటో సూప్

బాగపండిన 12 టొమేటోలు శుభ్రముగ కడిగి, చిన్నచిన్న ముక్కలుగా ఒక కళాయి పాత్రలో తరిగి వెయ్యాలి. అందులో 6 కప్పుల నీళ్లు, 25 మిరియాలు వక్కాచెక్కాగా చితక్కొట్టి అందులో వేసి, పొయ్యిమీదపెట్టి బాగావుడకనియ్యాలి. ఆ వుడికిన దానిని తెల్లటి పలుచనిగుడ్డతో వడబోసి ఒక చంచాడువుప్పు వెయ్యాలి. తరువాత నీరుల్లిపాయను వొలిచి సన్నగతరిగి నెయ్యితో కమ్మటివాసన వచ్చే వరకూ వేయించి ఆ టొమేటోల రసములోనే వేయాలి. కాస్తబియ్యపుపిండిని నీటిలో కలిపి పల్చనిముద్ద చేసుకోవాలి. మళ్లా సూపును పొయ్యిమీదపెట్టి, ఈ ముద్దను మెల్లిగా చేరుస్తూ, కలియబెట్టుతూ 10 నిమిషములు వుడకనియ్యాలి. వుడికినతరువాత తిరిగి వడబోసి, వేడివేడిగావున్నప్పుడే ఆసూప్‌ను కర్చుచేసెయ్యాలి. ఈ సూపు ఆరోగ్యానికి బలానికి చాలా మంచిది.

యం. సుశీల

# శ్రీ కృష్ణ మహిమార్ణవము

## శ్రీ కే. యన్. కేసరిగారికి అంకితము.

శ్రీమతి దేశిరాజు భారతీదేవి

(డిసంబరుసంచిక తరువాయి)

## పంచమతరంగము

### శ్రీ కృష్ణుడు భగవంతుడే

మరునాడు సాయంకాలము వంటపనిచేసి, పిల్లల రాకకై యెదురుచూచుచున్న తల్లియొద్దకు పిల్లలొక్కొక్కరే వచ్చిచేరిరి. 'కథ కథ' అని గోల చేసిరి. అన్నయ్యకూడారానీ అని అంటూవుండగానే పెద్దపిల్లవాడు వచ్చెను. తండ్రియువచ్చి నీ పురాణమింకను ప్రారంభము కాలేదాయని నవ్వుచూ కుర్చీమీద వ్రాలెను. పిల్లవాడు "అమ్మా! యీపూటతో మన పురాణము ముగించవలెను రేపటినుండి నేను పరీక్షకు చదువుకోవలెను" అని త్వరపెట్టెను.

తల్లి: కృష్ణుడు భగవంతుడా, కాడా? అన్న విషయము రుజువుచేయమంటూరు మీనాన్నగారు. నేనంతటి జ్ఞానినికాను. అయిన పెద్దలచేసిన్న కొన్ని హేతువులవలన శ్రీ కృష్ణుడు భగవంతుడే యని చెప్పవచ్చును; నమ్మవచ్చును. చరిత్రకారులు భక్తులు అనువారు వేరువేరు ధృకపథమున కృష్ణుని గూర్చి విచారింతురు. చరిత్రకారుని పని వేరు, దృష్టి వేరు. భక్తునిదృష్టి, పని వేరు. ఒకనిగూర్చి చరిత్రవ్రాయునప్పుడావ్యక్తి కారోపింపబడిన కార్యము లెప్పుడెట్లు జరిగినవి, జరిగినవా లేదా! మున్నగు విషయముల చర్చించి ఆ పాత్రముయొక్క ప్రవర్తనను మానవజీవిత చరిత్రతో పోల్చి విమర్శించి గుణాగుణ విచక్షణ చరిత్రకారుడు చేయుచుండును. భక్తున కట్టియంశములతో ప్రసక్తిలేదు. అతనికి విశ్వాసము, భక్తి మాత్రమే ప్రధానములు. కృష్ణుని జీవితమునంగల ప్రతి యంశమునందును భక్తునకు విశ్వాసముండునేగాని విమర్శచేయ తలంపేలేదు. శ్రీమద్భాగవతమున వర్ణించిన లీలలన్నియు భక్తునకు భగవల్లీలలే! "కృష్ణస్తు భగవాన్ స్వయమ్" అను భాగవత వాక్యమున భక్తున కపనమ్మకము లేనేలేదు. శ్రీకృష్ణునియందుగల ప్రతివిషయమందును అంతరార్థమే అతని దృష్టికి గోచరించును. కృష్ణుని నీలమేఘచ్ఛాయ విచారించుచో, అనంతమగు గగనమునకును అగాధమగు సముద్రమునకునుగల రంగు అది. అందుచే నాతని స్వరూపమనంతమై ఆయన మహిమగల గాఢమైనవని నిస్సందేహముగా భక్తుడెంచును. అంతేగాక నిజముగా రంగులేని యాకాశమున దోచురంగు కృష్ణున కారోపించుటచేత భగవంతునకు రంగు సహజముగా లేదనియును, అగాధ అనంత పదార్థముల రంగు నారోపించుట దైవత్వ సూచనయని భక్తులు విశ్వసింతురు. తరువాత వక్షస్తలోపరిభాగముల పీతాంబరమువలన, పచ్చనిరంగు సూచింపబడెను. అందుచేత దుర్బలులై, దరిద్రులై యార్తులైనవారి వివర్ణత సూచితమగును. అట్టివారికి తన హృదయమున తావుగలదనియును నీలపీతవర్ణముల సమ్మేళనమున నాకుపచ్చరంగేర్పడుటచే ఆకుపచ్చవర్ణమువలన సత్త్వగుణ చాకచక్యముగల్గునుగావున ఆర్తులు భగవంతుని హృదయస్పర్శ గలుగగానే బలోత్సాహ తేజములతో తేజరిల్లుదురని చెప్పవచ్చును. కృష్ణుడు సత్స్వరూపుడు, చిత్స్వరూపుడు ఆనందస్వరూపుడగుటచే, ప్రపంచకారణములగు పంచభూతములేగాక దేవదైత్య మానవాత్మలనుగూడ శాసించి తన యధీనమునందుంచుకొనగల్గును. గోవర్ధన పర్వతమెత్తుటచే పృథివీతత్త్వమును, వరుణలోకమునుండి నందునితీసుకొనివచ్చుటచేత జలతత్త్వమును, దావాగ్నిని మ్రింగుటచేత అగ్నితత్త్వమును,

తల్లికి తన ముఖమందు విశ్వము చూపుటచేత ఆకాశాది తత్వములను శాసించి వానిపై తనకుగల అధికారము చాటెను. అట్లే శిశుపాల, దంతవక్త్రి, కంస ముఖర దుష్టాత్ముల శాసించెను. ధర్మజు రాజసూయమున పూజింపబడుట, రాస క్రీడలయం దనేక రూపము లనేక కాలముల ధరించుట, వంచింపవచ్చిన బ్రహ్మను వంచించి గోవత్సరూపములతో నెల్లయెడల తానే విశ్వముగాతోచుట అను నీ యమానుష కార్యములవల్ల అనగా వివిధాకృతులతో మానవులుగాను పశువులుగాను కనుపడుటవలన సృష్టిస్థితిలయములు తన కధీనములని తెల్పెను. మఱియు గోవర్ధనధారణచే, దేవతలకు రాజగు నింద్రునిపై యధికారమును, గోవత్సహరణ సందర్భమున సృష్టికర్త యగు బ్రహ్మపై యధికారమును, బాణాసుర సంగ్రామముతోలయ కర్తయగు నీశ్వరునిపై యధికారమును తనకుగలదని వ్యక్తపరచెను.

ఆయన నోటినుండి వెడలిన గీతలు అక్షయ విజ్ఞానమును తెలుపుచున్నవి. బృందావనమునందును, సాందీపుని యాశ్రమమందును, ద్వారకా సౌధములందును, కురుసభలోను, భారత సంగ్రామమునను సమస్త ప్రదేశములలో ఆయన చర్యలెల్ల అపార బుద్ధిబలమును దైవశక్తిని స్పష్టపరచును. ఆయన యోగీశ్వరేశ్వరుడేగాక సమస్తశాస్త్ర సంవేది సకల కళారహస్య వేత్తయని చూపును.

పెదవులపై వేణుగానముతో జీవితమెల్ల రసమయమైన కృష్ణుడు కేవలమానంద స్వరూపుడే! ఆయన జగన్మోహన స్వరూప గానములచేత మానవ తిర్యగ్జంతు సంతానమేగాక తరుగుల్మ లతాలావితానము సయితము నాకర్షింపబడి ఆనంద పారవశ్యము గాంచెనని భాగవతమున స్పష్టముగా చెప్పబడినదా ఆయన గానముచే, నచేతనమైన యమునాజలము సైతము కంపించ నాట్యమాడెనట. శ్రీకృష్ణభగవానుని ఆనంద సౌందర్య మహిమ అట్టిది.

కాళీయఫణములపై చిందులు ద్రొక్కుచునాట్యమాడుటవల్ల ఆయనకు మృత్యువుపై నధికారము కలదని చెప్పకున్నను-ఆయన అల్లకల్లోలమై దుఃఖ బంధ సహితమైన కారాగారమున జనించుట యనగా ప్రళయస్థితినుండి ప్రపంచసృష్టి గల్గెనని యును బంధమునుండి మోక్షము గల్గుననియును సూచించును. ఈ కారణములన్నియు కృష్ణుని భగవంతుడని నమ్ముటకు చాలవా?

శ్లో॥ పరిత్రాణాయ సాధునాం వినాశాయచ
దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి
యుగే యుగే!

అనునది దివ్యవాణి. అందుచేతనే పరమేశ్వరుడు అవతరించుచుండునుగదా.

ఇకమీరు నమ్మినా నమ్మకున్నా నా నిశ్చితాభిప్రాయమింతేనంటూ తల్లి లేచెను.

“నాన్నగారు మీరేమంటారు” అని పిల్లవాడడిగెను.

తండ్రి:-మీ అమ్మ చెప్పినదంతా సులభముగా త్రోసివేయ వీలులేదురా! చాలా గ్రంథాలు తిరగేసినట్లున్నదోయి! నేనుకూడా అంతేనని యేకీభవిస్తానులే!

“పిల్లవాడు:-చాలా మంచి సంగతులు చెప్పావమ్మా!
పెద్దపిల్ల: దీని కంతకు మన కమలే కారణమన్నయ్యా!

అది అడక్కపోతే యిదంతా చెప్పేదేకాదు.

అవునవును అంటూవెళ్లి అమాంతము చిన్న చెల్లెలి నెత్తికొని ముద్దులాడి అభినందించాడు. చిట్టి తన అన్నచేతులలోనుండి జారివెళ్ళి శ్రీకృష్ణుని బొమ్మనుతెచ్చి ‘చక్కా పూలుపెట్టినానంటూ’ చూపింది. అందరు నవ్వినారు. పెద్దపిల్ల కొబ్బరికాయతెచ్చి నేను ప్రసాదం పెడతాను అంటూ కృష్ణుని వద్ద టెంకాయకొట్టింది. కర్పూరముంటే హారతి

పట్టమని నాన్నగారన్నారు. గబగబా వెళ్ళి కర్పూరం తెచ్చి ముట్టించాడు పెద్దపిల్లవాడు. పాటయెవరు పాడుతారన్నది పెద్దపిల్ల. "పాట మీనాన్నగారిని పాడమనండి" అన్నది తల్లి నవ్వుతూ! ఆనందరస ప్రవాహము వెల్లువలై ప్రవహించి ఇల్లంతా ముంచి వేసింది.

బాల బాలికల లేతహృదయములలో భక్తి బీజములు నాటి, వారికి ఆస్తికబుద్ధి గల్గించదలంచిన యా తల్లి సత్సంకల్పము నెరవేరింది. ఇట్లు సదోబ్ధల గావించి భావిభారత పౌరులగు బాల బాలికలను ఆస్తికులనుగా జేయనిచో భారతీయులు తమ స్వధర్మము నిర్వహింపలేరు. అపుడు మనభారతీయ సంస్కృతి, నాగరికత నశించి విదేశభావ ప్రాబల్యము మారి భారతజాతి స్వస్వరూప నాశనము సంభవించును. కావున ఇట్టి తల్లులు దేశమున కొల్లలుగా నుద్భవించి పనిజేయుట అవసరము.

# మ ధూ లి క

మాతృక :
శ్రీ జయశంకరప్రసాద్

అనుసరణ :
హృదయిని

ఆకాశమున నీలాల మేఘాలు ఆ నీలాల మేఘాలలో స్వర్గలోకదుందుభి కృతగంభీర ఘోష; ప్రాగ్దిశనందలి యొక మేఘవిరహిత ప్రాంతమునుండి లోకబాంధవుడు తొంగి చూచుచుండెను — మహారాజుగారి సవారిని. పర్వత శ్రేణి సమీపమందలి సమతలమైన ఫలసమన్విత క్షేత్రమునుండి ధాన్యాదులు పరిమళ గంధమును వెదజల్లుచుండెను. నగర బహిర్ప్రదేశమున జయఘోష పిక్కటిల్లెను. జనసమ్మర్దమునందు రాజమాతంగము యొక్క యలంకృత శుండము న్నతముగా కానవచ్చుచుండెను. హర్షోత్సాహాలహరుల ప్రేరణచే నయ్యది పురోగామి యగుచుండెను. ప్రజ మంగళ సూచకమగు హర్షధ్వని గావించెను.

తేరులు, ఏనుగులు, గుఱ్ఱములు బారులు తీరియుండెను. ప్రేక్షక బృందము సహితమధికముగా నుండెను. గజరాజు కూర్చొనగా మహారాజు యంబారు నధిరోహించెను. సుందర సౌభాగ్యకన్యా బృందము నవామ్రపల్లవ సుశోభితంబైన మంగళ కళశములను, కుంకుమ పుష్పకీల భరితమైన సంచులతో మధుర గానాలాపనలతో పురోగామినులైరి.

మహారాజుగారి ముఖమండలముపై చిఱునవ్వు తొలకరించెను. పురోహిత వర్గము మంత్రాధ్యయనము గావించెను స్వర్ణరంజితమైన నాగటిమేడిని పట్టుకొ చేవదారి సొగసుగనున్న కోడెదూడలన మహారాజు అదలించెను. వాద్యవిశే ములు చెలరేగును. కన్యాకిశోరముల పుష్పవృష్టిని గావించెను.

అది ప్రసిద్ధమైన కోసల దేశపుటుత్సవము ఆ రోజున మహారాజు కృషీవలుడయ్యెను ఆనాడు సురరాజుపూజ బహువేడుకగ జరుగును. గోష్ఠి జరుగును. నగరవాసుల పర్వతప్రదేశమున నానందించెదరు. ప్ర వత్సర మీ నేద్యమహోత్సవ ముత్సాహ సంపన్నముగ నుండును. ఇతర రాజ్యము నుండి యువరాజ కుమారులు వచ్చి యీ యుత్సవమునందెంతయో యుత్సాహ ముతో బాల్గొందురు.

అందు మగధ రాజకుమారుడైన అర ణుడు ఒకడు; తన రథమునందుకూర్చొ మతిశయ కౌతూహలముతో నీ దృశ్యమున దిలకించుచుండెను.

విత్తనముల సంచిని దీసికొని మధూలి మహారాజువెంట నుండెను. విత్తనము నాటుచు మహారాజు తన చేయిని జూ నంతనే మధూలిక నాతనియెదుట న యత్తము జేయుచుండెను. ఈయేడు సేద్య మునకై మహారాజుగారిచే నెన్నుకొనబడి

మా పొలము మధూలికాధనము. అందుచే విత్తనముల నిచ్చు భాగ్యము మధూలికకే ప్రాప్తించెను. ఆమె కన్నెప్రాయపుసుందరి. పీతాంబరమామె శరీరముపై నటునిటు దోలాయమానమై శోభిల్లుచుండెను. సుందరి చలించుచున్న యావసనమును సవరించుకొను నొకసారి, తైల విహీనములైన కపోలముల వేఱొకసారి, ఆ కృషక బాల పరిశుభ్రఫాలభాగముపై స్వేదజల బిందువు లనంతముగ నుండెను. అవి యామె కనుబొమలయందుఁ బ్రవేశించు చుండెను. లజ్జాసమ్మానము లామె యధరములపై గించిత్ హర్షముతో సంచరించు చుండెను. కాని యామె మహారాజునకు బీజముల నిచ్చుటలో నిరుత్సాహమును జూపుటలేదు. జనులందఱు మహారాజు నాగలిని పట్టుటను జూచుచుండిరి - కౌతూహలముతో - విస్మయముతో ఇటు రాజకుమారుఁడరుణుండు గాంచుచుండెను-కృషీవల కన్యకయైన మధూలికను అహో! ఎంత మోహనసౌందర్యము! ఏమి యమాయిక చూడ్కి!

ఉత్సవప్రధానకార్యము సమాప్తమాయెను. మహారాజు మధూలికి పొలమునకు బహుకృతి - నిచ్చెను - కొన్ని స్వర్ణనాణెములను. అది రాజసారితోషికము. మధూలిక సంచియందు వేయఁబడిన స్వర్ణముద్రలను మహారాజుపై వెదజల్లెను. ఆ తరుణమందు మధూలిక యొక్క ప్రకాశవదనమును బ్రజ లాశ్చర్యముతో నవలోకింపఁ దొడగిరి. మహారాజు భృగుటి యించుక కదలెను. అంత మధూలిక యిట్లనెను.

"ప్రభూ! ఇది నా తండ్రితాతల భూమి. అట్టి దీనిని విక్రయించు టపరాధము అందుచే మూల్యమును గ్రహింపలేక పోవుతిని."

మహారాజు మాట్లాడబోవునంతలో వృద్ధమంత్రి తీక్షణస్వరముతో నిట్లనెను: "మూర్ఖురాలా! ఏమి ప్రేలుచుంటివి? రాజానుగ్రహ తిరస్కారమా! నీ పొలమునకు నాల్గింతల మూల్యము. అందులోఁ గోసలదేశపు సునిశ్చితమైన, రాజవంశ సంప్రదాయము. నీవు నేటినుండి రాజరక్షణకు నధికారిణివి; ఈ ధనముతో సుఖించు"

"రాజకీయరక్షణమునకుఁ బ్రజలందఱు నధికారులే. మంత్రివరా! మహారాజునకు భూమిని సమర్పించుటలో నా ప్రతినిరోధ మేమియు లేదు. కాని మూల్యమును స్వీకరించుట మాత్ర మసంభవము" మధూలిక యుత్తేజీత యాయెను.

మహారాజు సంజ్ఞచేయగా మంత్రి యిట్లు పల్కెను. "ప్రభూ! కాశీయుద్ధమందలి యద్వితీయశూరుడైన సింహమిత్రుని యేకైక పుత్రికయే యీమె."

మహారాజులిక్కిపడెను. "సింహమిత్రుని

పుత్రికయా! మగధ చోళ కోసలదేశ గౌరవమును గాపాడిన వీరుని తనూజాతయా!"

"చిత్తము దేవా!" సవినయముతో మంత్రి పల్కెను.

"ఈ యుత్సవ పూర్వాచారమేమి మంత్రివర్యా?" మహారాజు ప్రశ్నించెను.

"దేవా! ఆచారము సాధారణమైనదే. ఎవరైనను ఒక మేలయిన భూమిని యీ యుత్సవమునకై యెంచుకొని నియమానుసారముగా భూమిమూల్యమును బురస్కారరూపముగా నిచ్చుచుండుటగలదు. భూస్వామికత్యంతానుగ్రహ పూర్వకమగు భూసంపత్తికి నాల్గింతల మూల్యము లభించును. దానితో నా భూమిని యావ్యక్తియే ఆయేడంతయుగాచుచుండును. అది రాజుగారి పొలమని పిలువఁబడుచుండును."

మహారాజున కాలోచనా సంఘర్షణచే విశ్రాంతి యత్యంతావశ్యకమాయెను. మహారాజు మౌనాంకితుడయ్యెను. జయఘోషతో సభ చాలింపబడినది. అందఱు తమతమ శిబిరములకుఁ జనిరి. కాని యుత్సవమునందు మధూలికను మఱల యెవరును జూడలేదు. ఆమె తన పొలమందు విశాల మధూకవృక్షపు దట్టమైన పచ్చనియాకుల నీడ పరధ్యానముతో నిశ్శబ్దముగాఁ గూర్చొనియుండెను.

◆ ◆ ◆

విభావరియందలి యుత్సవమిపుడు విశ్రాంతి తీసికొనుచుండెను. కాని రాజకుమారుఁ డరుణుఁడు తత్కార్యమునందు విముఖుఁడై యుండెను - అతఁడు తన విశ్రాంతిభవనమందు జాగరణము చేయుచుండెను. కంటికి నిద్రలేదు. ప్రాగ్దిశయందు వికసించుచున్న గులాబిపూవు నందలి వర్ణమే యాతని నయనములందుండెను. అంతకముందు, కోట బురుజు గోడపై నొక కపోతపక్షి యేకచరణముపై నిలువఁబడి రెక్కలను విప్పికొని ఆవలింత తీసికొనుచుండెను. అరుణుఁడు లేచి నిలువఁబడెను. ద్వారమందు సుసజ్జితాశ్వముండెను. చూచుచుండగనే అయ్యది నగరతోరగమును జేరెను. రక్షక భటులు తూగుచుండిరి. గుఱ్ఱపు డెక్కల సవ్వడిచే వారులికిపడిరి. యువకుఁడు సాయకమువలె బయల్వెడలెను. సింధుదేశతురంగము ప్రభాతపవనముచేఁ బులకించుచుండెను. అరుణుఁడు, తనకరతలమందు శిరముంచుకొని మధూలిక ఖిన్న నిద్రాసుఖమును బొందుచున్న యా మధూకతరువు దరిఁ జేరెను.

కాంచె నరుణుఁడు - ఒక చిన్నమాధవీలత వృక్షమునుండి తెగి క్రిందపడియుండెనుఁ. కమలములు ముకుళితములైయుండెను. భ్రమరములు నిశ్చలముగానుండెను. అరుణుడు తన యశ్వమును మౌనముగానుండ సంజ్ఞచేసెను, ఆదివ్యశోభను దిలకించుటకు. కాని కోకిల

కూలెను - ఛీ! కన్యయొక్క స్వప్నాంకిత సౌందర్యముపై దృక్కులఁ బఱపు దుష్టా! ఎవడు నీవు! మధూలిక నేత్రములున్మీలితములాయెను ...సమ్ముఖమున నొక యపరిచితుఁడైన యువకుఁడు. సంకోచముతో నామె లేచి కూర్చుండెను.

"ఓ యపరిచితుఁడా! నీ వేకదా, నిన్నటి మా యుత్సవమునకు సంచాలికుఁడవు!"

"... ఉత్సవమా! ఆఁ ఉత్సవమే..."

"నిన్నటి యా సమ్మానము ..."

"ఏమి, మిమ్ములను నిన్నటి స్వప్నము బాధించుచున్నదా? అపరిచితుఁడా! మీరు నన్ను యీ పరిస్థితిలో సంతోషముతో నుండనివ్వరా యేమి?"

"దేవీ! నా హృదయము నీ సౌందర్యమునకంకితమైనది"

"నా యీ ప్రవర్తనకా ... చిఱునవ్వనకా. ఓహో! మానవుఁడెంత నిర్దయుఁడు! అపరిచితుఁడా, మన్నించు! నీ మార్గమున నీవు వెళ్లుము."

"సరళ మూర్తిమా! నేను మగధదేశ రాజకుమారుఁడను. నీ యనుగ్రహమునకై ప్రార్థించుచున్నాను. నాహృదిలోని భావన గూఢముగా నుండలేదు. దానిని నీ ..."

"రాజకుమారా! నేను కృషకబాలికను! మీరా నందనవన విహారులు - నేనా భూసేద్యము జేసికొని జీవించుదానను. నేఁడు నాప్రియమైన భూమి నుండి నా యధికారము అపహరింపఁబడినది. నేను దుఃఖాకులను. నన్ను హాస్యము జేయకు ...."

"నేను కోసలాధీశునినుండి నీ భూమిని నీ కిప్పించెదను."

"వలదు. అది కోసలదేశనియమము. నేను దానిని మార్పదలచను - దానివలన నాకెంత దుఃఖ మాపాదించినను సరే."

"అయిన, నీ రహస్యమేమి?"

"ఈ రహస్యము మానవ హృదయ సంబంధమైనది. నాది కాదు. రాజకుమారా! నియమముచే మానవ హృదయము బాధింపఁబడుచో నేఁడు మగధరాజకుమారుని హృదయ మొకరాజకుమార్తెనుండి మఱియొక కృషీవల బాలిక నవమానము చేయుటకు సిద్ధముగాదు" అని మధూలిక పల్కుచు లేచి నిలువఁబడెను.

హతాశుఁడై రాజకుమారుఁడు వెనుఁదిరిగెను. అరుణకిరణములందతని రత్నమకుటము ప్రకాశించెను. అశ్వము వేగముతోఁ బరుగిడుచుండెను. ఇటు మధూలిక నిష్ఠురవచన ప్రహారముచేసి తాదృప్తి పడినదా? ఆమె హృదయమందు సంచలనము ప్రారంభమాయెను. ఆమె సజల నేత్రాలతో నశ్వచరణోద్ధూతధూళినిఁ జూడసాగెను.

♦ ♦ ♦

మధూలిక రాజప్రసాదమైన బహుకృతిని స్వీకరింపలేదు. ఆమె పరులపొలములందుఁ

బనిచేయుచు నాలుగుగడియలు లభించిన దానితో బ్రతుకుచుండెను. మధూక వృక్షముక్రింద నొక చిన్న పటకుటీరము కలదు. ఎండుకొమ్మలతో దాని గోడలు కట్టఁబడియుండెను. అదియే మధూలిక యాశ్రయము. కఠోరపరిశ్రమవలన లభించు రసహీనాన్నమె ఆమె యసువులు నిలుచుట కాధారమగుచున్నది. దుర్బలయైనప్పటికి, ఆమె శరీరమందుఁ దపోకాంతి యుండెను. పరిసరమందలి రైతులామె నాదరించుచుండిరి. ఆమె యొక యాదర్శ కన్యక. దినములు, వారములు; మాసములు, వత్సరములు గడువసాగెను.

అది శీతకాలపురాత్రి. నభము మేఘసంభరితము. అందు విద్యుత్సంచలనము. మధూలిక ధరించిన వసనము కల్లోలమగుచుండెను-కప్పుకొనుటకు వస్త్రాభావమున చలికి వణకుచు నామె యొకమూలఁ గూలఁబడిపోయెను. నేఁడు మధూలిక తన దుస్థితినిఁగూర్చి పరిపరివిధముల నాలోచించుచుండెను. జీవితమునకు సంబంధించిన యుపకరణములు తమ ప్రభావమును నిర్ధారణ చేయుచుండును కాని వాని యావశ్యకత కల్పనాభావనతోపాటు వృద్ధిక్షయములగుచుండెను. నేఁడు బహుదినముల కామెకు గడచిన సంఘటనము గుర్తుకు వచ్చెను - రెండు, కాదు కాదు, మూఁడేండ్లయియుండును, యిదే మధూక వృక్షము క్రింద, ప్రభాతమందు...యువరాజకుమారుఁడేమని యుండెను?

ఆమె తన హృదినిఁ బ్రశ్నించెను - ఆ ప్రియమైన వచనములను వినుట కుత్సాహియై అడుగసాగెను-"ఏమని పల్కెను?" దుఃఖదగ్ధ హృదయ మాస్వప్న తుల్యములగు పలుకులను స్మృతిపథమందుంచుకొనగలదు. స్మరించుకొనగలిగినచో నామె కష్టముల నీ కాలరాత్రియందుఁ దెల్పుటకు సాహసింపఁగలదు? అహో యేమిపరిహాసము!

నేఁడు మధూలిక గతించిన యాకాలమును దిరిగి పొందుటకు వికల హృదయిని యయ్యెను. నిస్పృహాయ దారిద్ర్యప్రహారము లామెను వ్యథితను - అధీరను జేసివైచినవి. మగధ ప్రాసాది కుడ్యావళి వైభవ కల్పనా చిత్రము - ఆ యెండుకొమ్మల సందులనుండి - గగన విద్యుత్ప్రకాశమందు నాట్యమొనరించుచున్నట్లు కనుపింపసాగెను. ఆటలాడుకొను శిశువు శ్రావణమాస సాంధ్యసమయమందు మిణుగురు పురుగును బట్టుకొనుటకెట్లు తన చేతినిఁ జాపుచుండునో యట్లే మధూలిక, "ఇప్పుడే యతఁడు ... అతఁడు వెడలిపోయెను" అని మనసులో నుచ్చరించుచుండెను.

వర్షము భీషణరూపమును దాల్చెను. భోరుమని ధ్వని చెలరేగెను. ఒడగల్లు రాలు సూచనగా నుండెను. మధూలిక

తన జీర్ణపర్ణ కుటీరమునకై కంపించెను. హఠాత్తుగా బహిర్త్రి దేశమునఁ గొంత సవ్వడి యాయెను.

"ఎవరిక్కడ? ఈ పాంధునకాశ్రయ మిచ్చెదరా!"

మధూలికకొమ్మల తలుపు తెరిచెను. మెఱపు మెఱిసెను — ఒక యువకుఁడు గుఱ్ఱపు కళ్లెమును బట్టుకొని నిలువఁబడి యుండెను. అకస్మాత్తుగా నామె వదనము నుండీ మాటలు వెల్వడెను — "రాజకుమారుడా!"

"మధూలికా!" ఆశ్చర్యముతో యువకుఁడనెను.

ఒక్క క్షణమువఱకు నిస్తబ్దత వ్యాపించెను. మధూలిక తన కల్పనాజగత్తును ప్రత్యక్షముగాఁ గాంచి చకితురాలాయెను. "ఇన్ని దినముల తర్వాత నేటికి మఱల"

అరుణుఁడు, "ఎంత వేడికొంటిని నేను కాని ..."

మధూలిక తనదైన్యస్థితిని దెలుపుకొనుట కిచ్ఛగింపలేదు. ఆమె, "ఆఁ నేడు మీ యీస్థితి యేమి?" అని యడిగెను.

వంగిన మోముతో, అరుణుఁడు పల్కెను — "నేను మగధనుండి బహిష్కరింపఁబడిన విద్రోహిని. కోసలయందు జీవితాన్వేషణమునకై వచ్చితిని."

ఆ యంధకారమందు మధూలికకు నవ్వు వచ్చెను — "మగధదేశ విద్రోహియైన రాజకుమారునకు స్వాగత మిచ్చునదా ఒక యనాథకృషీవలకన్య! ఇదికూడ నొక పరిహాసమే! అయినను స్వాగత మిచ్చుటకు సంసిద్ధురాలను."

♦ ♦

శీతకాల నిస్తబ్ద నిశీథి సమయము; హిమముచే స్వచ్ఛందమైన జ్యోత్స్న; ఎముకల కొఱకు చలిగాలి: అయినప్పటికి నరుణుఁడు, మధూలిక యిద్దఱును పర్వత గహ్వరద్వారముచెంత వటమహీరుహముక్రింద నాశీనులై సంభాషించు చుండిరి. మధూలిక స్వరమం దుత్సాహము నిండి యుండెను. అరుణత్యంత సావధానముగా భాషించు చుండెను!

మధూలిక ప్రశ్నించెను: "నీ వింతటి విపన్నావస్థలో నున్నప్పటికి నింతమంది సైనికులను వెంట నుంచుకొనుట కేమి యావశ్యకము?"

"మధూలికా! వీరులకు బాహుబలమే యా జీవిక. వీరు నా జీవన మరణస్నేహితులు. వీరిని నేనెట్లు విడచి పుచ్చెదను! విడచి నేనేమి చేయుదును?"

"ఎందుకు? మనము పరిశ్రమచేసి సంపాదించెదము, భుజించెదము, ఇప్పుడు నీవు"

"విస్మరింపకు మధూలికా! నాకు నా బాహుబలముపై విశ్వాసమున్నది. నూతన రాజ్య స్థాపన చేయఁగలను. నిరాశ నెందుకు చెందెదను?" అరుణుని మాటలలో నాశా రేఖ యుండెను. అది యేమొ తెలుపఁ గోరుచుండెను. కాని వెలిబుచ్చలేక పోవు చుండెను.

(సశేషము)





# రసాస్వాది

శ్రీ ఎ. వి. ఎస్. రామారావు

ఆఫీసుగదిలోంచి ఆరున్నరకి యివతలపడ్డాడు శ్రీ హరిరావు. "అందమె ఆనందం" అన్న పాటను రేడియో బుంగరెచ్చిన కంఠంతో ప్రసారం చేస్తున్నాది. శ్రీ హరిరావు మనస్సంతా ఇంటివేపు పోతున్నాది. గమనవేగాన్ని హెచ్చించేడు. కాఫీ లేకపోవడాన్న కాళ్లు తొట్రుపడుతున్నాయ్! ఆ రోజే, అరువిచ్చే అయ్యరు బాకీ డబ్బు చెల్లించి మళ్లీ వాడకం పెట్టమన్నాడు. అవును! అతను మాత్రం ఎన్నాళ్లని ఊరుకుంటాడు? మూడునెలల బట్టి చెల్లించకపోతేను. ఇంట్లో ఇబ్బంది జాస్తిగా యుంది. అందంలో ఆనందం ఉందా? అందం అనుభవించగలిగినవాడికి ఉంటుందేమో? పోనీ పెళ్లి చేసుకుంటే కొంత మనస్సుకి శాంతి ఉంటుందేమో? యీ కుటుంబానికి మరోమనిషి ఎక్కువైతే మరింత అశాంతి రేగుతుందేమో? తన జీవితమంతా ఇలాగే గడుస్తుందేమోనన్న ఊహలు అప్పుడప్పుడు తనలో చెలరేగకపోలేదు. తల్లి, తను తమ్ముడు, ఇద్దరు చెల్లెళ్లు. అందరూ చదువుతున్నారు. జీతాలు అందరికీ కట్టాలి! సంక్రాంతికి వాళ్ళకి బట్టలే కుట్టించలేదు. అయినా వాళ్లు మిగతా పిల్లలలాగ ఏది చూస్తే అది కావాలని పోరుపెట్టేవారుకారు. జీతం కట్టి, ఇంటద్దె ఇచ్చేసరికి తలప్రాణం తోకకి వస్తున్నాది. తమ్ముడు మెల్లిగా స్కూలుఫైనలు ప్యాసయితే చేతికి అందొస్తాడు. పాసయినా మార్కులు నలభై రావాలి! లేకపోతే తనలాగే స్థిరమైన ఉద్యోగం దొరకదు. నలభై మార్కులు రాకపోతే మళ్లీ కట్టించాలి. ఇప్పుడు తనపనీ అలాగే వచ్చింది. సర్వీస్ కమీషనుకి కట్టడానికి మార్కులు రాలేదు. కట్టకపోతే ఎన్నాళ్లయినా స్థిరంకాదు. తను నాలుగు సంవత్సరాలనుంచీ పనిచేస్తున్నాడు. యీ సర్వీసంతా బూడిదలోపోసిన పన్నీరే! మళ్లీ తక్కువ మార్కులు వచ్చిన సబ్జక్టుకి కడదామంటే తెల్లవారిన దగ్గర్నుండి పొద్దుపోయేవరకూ ఆఫీసుపనే తెమలడంలేదు. చదవడానికింక తీరుబడేదీ? పగలల్లా ఎద్దులా పనిచేసి వచ్చి, చదువుదామన్నా భోజనమయేసరికి, యీ బద్దకంమీద మొద్దునిద్దుర ఆవహిస్తుంది. పుస్తకం పట్టినా తలకెక్కదు. మొన్నను పదేళ్ల సర్వీసున్న గుమస్తాను సర్వీస్ కమీషన్ మిషతో తీసివేసేరట. యీ వార్త తన చెవిలో పడ్డప్పుడు తన గుండెలాగ కొట్టుకొంది? తననూ అలాగే ఏనాడయినా తీసివేయవచ్చును. అప్పుడు తనగతేమిటి? తనతల్లి చెల్లెళ్ళగతేమిటి? 70 రూ|| తెస్తూనే భోజనం బట్ట సరీగా పెట్టలేక పోతున్నానే! అప్పుడేం చెయ్యడం? శ్రీ హరిరావు గుండె ఇంకా దడదడలాడుతున్నది. మొన్నను తను పని చేసే ఆఫీసులో సంవత్సరం సర్వీసు ఉన్నవాడిని తీసేసి, క్రొత్తగా సర్వీస్ కమీషన్ ప్యాసయిన వాడిని వేసేరు! అయితే మాత్రం ఆఫీసంటే ఏమిటో ఎరుగని అతనేంపని చేస్తాడు. అతను సరిగ్గాపని నేర్చుకునే వరకూ అర్జంటు కాయితాలు తనను చూడమన్నాడు హెడ్‌గుమస్తా!

యిలా ఏవేవో ఆలోచనలతో తన యిల్లు దాటి పైకి వెళ్లిపోతున్న సంగతి గుర్తుకొచ్చి, తనలోతనే నవ్వుకుంటూ వెనక్కి మళ్లేడు శ్రీహరిరావు.

వాలు కుర్చీలో కూర్చుని వాళ్లమ్మ యిచ్చిన కాఫీని తాగుతుండగా వాళ్లమ్మ ప్రక్కను నిలుచుంది. నాయనా! మీ పెద్దనాన్న వచ్చేరు! ఏదో సంబంధం చూసేరట. పిల్ల అందంగానే ఉంటుందిట, నాల్గు అక్షింతలు నీనెత్తిమీద వేస్తే నాభారం వదలిపోతుంది! అన్న తల్లిమాటలకు ఒక చిరునవ్వు నవ్వేడు శ్రీహరిరావు. "ఉద్యోగం స్థిరం అవందే పెళ్లెందుకమ్మా? ఇప్పటికే నేను తెచ్చేది 'గోచీకిపెద్ద గావంచకి చిన్న'అన్నట్టుంది. తమ్ముడు పరీక్ష పేసయి చేతి కందొచ్చేక చేసుకోవచ్చును," అన్నాడు. "నాయనా! వచ్చే పిల్ల అదృష్టవంతురాలైతే ఉద్యోగం ఖాయమవడమేమిటి? పెద్ద ఉద్యోగమే అవుతుందిరా" అన్నతల్లి పూర్వకాలపుమాటలకి నవ్వొచ్చింది శ్రీహరిరావుకి. "అవి పూర్వకాలం మాటలమ్మా! వచ్చేదాని అదృష్టాన్ని బట్టి ఉద్యోగం ఖాయం అవదు. మళ్లీచదివి నలభై మార్కులూ తెచ్చుకొని సర్వీస్ కమిషన్‌కి కట్టి పాసయితే అప్పుడు ఖాయం అవుతుంది" అన్నాడు శ్రీహరిరావు. ఒక సంవత్సరం సర్వీసు ఉన్నవాళ్లు సర్వీస్ కమిషన్ మార్కులు లేకపోయినా సర్వీస్ కమిషన్‌కి కట్టవచ్చునని గవర్నమెంటు ఆర్డరువచ్చింది. ఆ మాట విన్న శ్రీహరిరావు ఆనందానికి అంతులేకపోయింది. అప్పుడే సర్వీసు కమిషన్ పేసయినట్లు, ఉద్యోగం స్థిరమైపోయినట్లు, తన జీవితం సుఖంగా నడుస్తున్నట్లు ఊహలను అల్లుక పోతున్నాడు. గుమాస్తాలమీద చూపిన యీ కరుణకు ప్రభుత్వానికి ధన్యవాదా లర్పించేడు. అదే మొదటిసారిగా ఐదుగంటలకు ఆఫీసునుంచి బయటకొచ్చేడు. "స్థిరము స్థిరమంటే బ్రతుకది స్థిరమా! సుస్థిరమైనది తెలియుము మనసా" అని రేడియోలుంగ అరవబాణీలో అరఘంట నుంచి అలాపిస్తుంటే వింటున్న శ్రీహరిరావుకి దాని అర్ధం తెలియక, తన ఉద్యోగం స్థిరమాతుందన్న విషయం తల్లికి వినిపిద్దామని ఇంటికి పరుగెత్తేడు.

తల్లి ఆశీర్వచనంతో పరీక్షలో నెగ్గేడు శ్రీహరిరావు. తమ్ముడిని పిలిచి 'పరీక్షలు దగ్గరికివచ్చేయి! జాగ్రత్తగా చదువు; నలభైమార్కులు రావాలి!' అని చెప్తుంటే అయోమయంగా వింటున్నాడు వెంకట్రావు. శ్రీహరిరావు ఇంకా చెప్పుకొని పోతున్నాడు 'ఆఫీసర్లదగ్గర అణకువగా ఉండాలి! ఎన్నన్నా పడాలి! వీటికి ముందే అలవాటు పడాలి!' వెంకట్రావు ఇంక వినలేక పోయాడు. "ఇప్పుడవన్నీ ఎందుకన్నయ్యా" అన్నాడు కటువుగా! "ఎందుకేమిటి? ప్రపంచంలో గుమాస్తాగా జీవించాలంటే కావలసినవి అణకువ, ఎన్నన్నా తనను కాదని పడివుండే ఓరిమీ, పగలూ రాత్రీ అనకుండా పనిచెయ్యగలిగే శక్తి, నువ్వొక పశువని అంటే చిత్తం చిత్తం అనేటంత శాంతం! కాఫీ తాగడానికి, ఇంటద్దెకీ ఇచ్చే జీతం చాలకపోయినా కల్లెక్కదీనుకుని పనిచెయ్యగలిగే ప్రతిభ, ఆఫీసరు అవసరాలను కనిపెట్టి తనంతటతానే సమకూర్చగలిగే నిదానం, ఇంకా చెప్పాలంటే చాలా ఉన్నాయ్! నువ్వు పరీక్ష పాసయేక చెయ్యకుల సిందాపనేకాదా! సంపాదించుకొనే శక్తిగలవాళ్లు పెద్దపెద్ద ఉద్యోగాలే సంపాదించు కుంటున్నారు. మనకు యీ ఉద్యోగం దొరకడమే కష్టం' అని చెప్పుకపోతున్నాడు శ్రీహరిరావు. "నన్ను ఇక్కడితో చదువు ఆపి ఉద్యోగం చెయ్య మనా అన్నయ్యా" అని విచారంగా చూస్తున్న వెంకట్రావుని బుజ్జగించి, 'నేను తెచ్చే జీతం ఎంతో, ఎలాఖర్చవుతున్నదో నీకు తెలియదా తమ్ముడూ! మొన్న నీ పరీక్షకి డబ్బుకట్టడానికి ఎంత ఇబ్బంది పడ్డామో మర్చిపోయావా? కుటుంబంపెద్దది. యీ సమయంలోనువ్వు నా చేతికి అందివస్తే నాకెంత సహాయంగా ఉంటుందో ఆలోచించు! నువ్వు ఉద్యోగం చేస్తే, అంత్య దశలోనైనా అమ్మ కొంతసౌఖ్యాన్నను భవిస్తుంది. నేను ఎంత ఉద్యోగం చేసినా అమ్మకు సౌఖ్యం చేకూర్చలేక పోతున్నాను. అమ్మని సౌఖ్యపెట్టే బాధ్యత నీకులేదూ'? అంటూ దీనంగా చెప్తున్న శ్రీహరిరావు మాటలకు వెంకట్రావుకి కళ్ళనీళ్ళ పర్యాంతం అయింది. 'అలాగేనన్నయ్యా! నీ ఇష్టప్రకారమే

చేస్తాను. పరీక్షలు దగ్గరపడ్డాయి! ఇప్పటినుంచీ ఉద్యోగప్రయత్నం చెయ్యి!' అన్న తమ్ముడి మాటలకి తన మీది భారమంతా వదలిపోయినట్లే భావిస్తూ, ఆనందభాష్పాలను రాలుస్తూ, తమ్ముడిని గాఢాలింగనం చేసుకున్నాడు శ్రీహరిరావు.

అక్కడనుంచి తన జీవితానికి ఒకస్థిరత్వం, నిశ్చింత ఏర్పడుతుందనుకున్నాడు. పెళ్లిచేసుకొని హాయిగా కాలం గడపవచ్చునని కలలు కన్నాడు. కలలు కల్లలైనట్లే, శ్రీహరిరావు ఊహలు గాలిమేడలై పోయాయి. ఆశలు అడియాసలైనాయి. వెంకట్రావు పరీక్షలో ప్రతిసబ్జక్టులోనూ నల్ఖైమార్కులు తెచ్చుకోలేదు సరికదా! పరీక్షకూడా పోయిందన్న విషయం తెలియగానే శ్రీహరిరావు నిలువునా నీరై పోయేడు. కోపంపట్టలేని స్థితిలోకి వచ్చేడు. ఆకోపం అంతకంతకూ అధికమై, మరోమార్గంగా పోవడానికి వీలులేక దుఃఖంగా మారింది. తను ఆఫీసులోనున్న మాటే మరచిపోయేడు. కోపం కొంత ఉపశమించింది. సుఖం, సౌఖ్యం, దగ్గర్లోనున్నాయనుకున్న తనకు యీ దెబ్బ తేరుకోలేనిది. మళ్లీ మరోసంవత్సరం భోజనాలకీ జీతాలకూ తనెక్కడనుంచి తెచ్చి పెడతాడు? తనిలాగ కష్టసాగరంలో యీది యీది, కాళ్లుతేలి, మునిగిపోవలసిందేనా? తన తమ్ముడు ఉద్యోగంచేసి కష్ట సాగరంనుంచి దాటిస్తాడని పొంగేడే! భగవంతుడుకూడా పగబూనేడా? ఇలా తలపుమీద తలపు రావడంతో మళ్లీ కోపం విజృంభించింది. ఇంతలో ప్రక్కగుమాస్తా 'శ్రీహరీ! రిజల్ట్సువచ్చేయి! నీకష్టాలిక గట్టెక్కుతాయ్‌లే! మీతమ్ముడు చేతికందొస్తాడు' అన్నాడు. ఆగుమాస్తా మాటలు శ్రీ హరిరావుకి బల్లేలలాగ గ్రుచ్చుకోడమే గాక, హేళన చేసినట్లు తోచేయి! 'అగ్గి మీద గుగ్గిలంలాగ' ఆమాటలు తనమీద పనిచెయ్యడంతో తారామండలానికి లేచేయి కోప జ్వాలలు! కాయితాలు అలాగే ఒదిలేసి, ఆకర్ణాంతం నారినిలాగి వదలి పెట్టిన బాణంలాగ వెళ్లేడు యింటికి. ఫస్టుక్లాసు వస్తుందనుకున్న పరీక్షపోయినందుకు తనకంటే ఎక్కువగా కుమిలిపోతున్న తమ్ముడిని మరో ఆలోచన లేకుండా ఆ చెంపా యీ చెంపా వాయించేడు. చెల్లెళ్లు గగ్గోలుపెట్టేస్తూ, శ్రీ హరిరావు స్వరూపం చూసి గడగడలాడిపోతున్నారు. తల్లి గబగబవచ్చి వెంకట్రావుని తప్పించి, ఎర్రగా కందిపోయి నెత్తురు చిమ్ముతున్న వెంకట్రావు బుగ్గల్ని చూపిస్తూ, 'నీకు కొట్టడానికి చేతు లెలావచ్చేయిరా? వాడి పరీక్ష పోయినందుకు ఏళ్లూవూళ్లూగా వాడేడుస్తుంటే, అది చాలక కొట్టేవా?' అన్న తల్లి వేపు కోపంగాచూస్తూ, 'నువ్వేవాడికిలాగ మప్పేవ్! నీనించే వాడిలా తయారయేడు! బాగా చదివితే పరీక్ష ఎందుకు పోతుంది? వాడి నింకా నేను మేపి జీతాలుకట్టలేను. డబ్బు ఏమీ పండడంలేదు నాదగ్గర! వాడి ముఖంచూడను. ఇంట్లోంచి పొమ్మను,' అన్నాడు శ్రీహరిరావు. తల్లి ఇంక ఆగలేకపోయింది! 'ఇంట్లోంచిపోయేది వాడొక్కడేకాదు! వాడితోపాటు నేనూపోతాను. మేము పోయాకయినా నీకు సుఖం కలుగుతుంది. వాడి రోజులు బాగులేక పరీక్షపోయింది గాని చదవకపోవడాన పోయిందా? మహామహులే ఒకటి రెండుసార్లు తప్పుతున్నారు! ఇన్నాళ్లూ చదివిన వాడూ ఇప్పుడు చదవని వాడూనా? ఏదో కూలిపని చేసుకుంటూ కట్టి పేసవుతాడు. ఏలడానికి ఊళ్లు లేకపోయినా ఏరుకుతిండానికి ఊళ్లున్నాయి!' అంటూ మూటాముల్లె పట్టుకొని, అమ్మా తమ్ముడూ వెళ్లిపోతున్నా, కోపం తగ్గకుండా పైస్థాయిలోనే శ్రీహరిరావు చలించలేదు. వాళ్ళని ఆపడానికయినా ప్రయత్నించలేదు! చెల్లెళ్లు కూడా బయలుదేరుతుంటే 'ఎక్కడికి?' అని గట్టిగా అరిచి కళ్లెర్ర జేసేసరికి, కళ్లల్లోంచి నీరుక్రక్కుతూ, గడగడలాడుతూ, పిల్లులలాగ చెరోప్రక్కా నక్కిపోయేరు. అవును! వాళ్లులేకపోతే తను పొద్దస్తమించేవరకూ ఆఫీసులో పనిచేసి ఇంటికొచ్చేసరికి ఇంతవండి పెట్టేవాళ్లెవరు? తను ఆఫీసునుంచి వచ్చి వండుకోవడం సాధ్యమా?

కొద్దిరోజులవరకూ అమ్మ తమ్ముడూ ఎక్కడికి వెళ్లేరో ఏంచేసేరో అన్న ఆలోచనే కలగలేదు శ్రీ హరిరావుకి. తర్వాత తప్పిన తమ్ముడు ఏదోకంపె

నీలో ఉద్యోగం చేస్తున్నాడనీ తల్లీ వాడూ కులాసాగా ఉన్నారనీ వార్తవిన్న శ్రీహరిరావు సంతోషించేడు. అప్పుడు ఆలోచించేడు - తనుచేసినపని తప్పేమోనని! తన తమ్ముడు జాగ్రత్తగానే చదివేడే? మరేం కారణమో పరీక్షపోడానికి? అంతు చిక్కలేదు. ఆలోచనలు అధికమై అశాంతి చెలరేగుతున్నాది. ఆఫీసులో పని సరిగ్గా చెయ్యలేకపోతున్నాడు. దాంతో ఏవో చివాట్లు తింటూనే ఉన్నాడు, నిత్యకృత్యం సాగిస్తూనే ఉన్నాడు. యీ తిట్లనుండి తప్పుకోడానికి వేరే మార్గంలేక కాఫీ అయినా త్రాగితే కొంచెం ఉషారుగా ఉంటుందని, ఆ ఉషారులో జాగ్రత్తగా పనిచెయ్యవచ్చని నిశ్చయించేడు. మనసు బాగులేకపోయేసరికల్లా కాఫీ హోటలుకిపోయి కాఫీ త్రాగడం ఒక అలవాటుగా పరిణమించింది. అలా ఎన్నిసార్లు వెళ్తున్నాడో లెక్కలేదు. దాంతో జీతంలో సగం కాఫీ హోటలుకి అయిపోతున్నాది. మళ్ళీ డబ్బు ఇబ్బంది ఎప్పటిలాగే మొలకెత్తింది.

నాలుగు నెలలు గడిచేయి! శ్రీహరిరావు వాలు కుర్చీలో కూర్చుని ఏవో ఆలోచనలలో మునిగి తేలుతున్నాడు. ఇంతలో చెల్లెలువచ్చి 'అన్నయ్యా పేపరు చూసేవా' అన్నది. 'ఏంపేపరమ్మా? అది చూడడానికి 'టైం' ఉంటే మరో రెండు కాయితాలయినా రాసేవాడిని. కాయితాలు గుట్టలు గుట్టలై పాపం పెరిగినట్టు పెరిగిపోతున్నాయ్' అన్నాడు విసుగ్గా శ్రీహరిరావు. 'గుమాస్తాలకు ఎక్కువ జీతాలు ఇస్తారుట' అన్న చెల్లెలి మాటకు హేళనతో కూడిన చిరునవ్వు నవ్వుతూ 'ఇలా చేస్తాం, అలా చేస్తాం' అని అనేవాళ్ళేగాని ఆచరణలోపెట్టి చూపించినవాళ్ళేరీ అన్నాడు శ్రీహరిరావు. ఇంతలో వాళ్ళమ్మ వచ్చింది. చాలా రోజులబట్టి తల్లికోసం వాచిపోయి ఉన్నారేమో చెప్పలేని సంతోషంతో అమ్మకాళ్ళకూ చుట్టేసుకున్నారు పిల్లలిద్దరూనూ! వాళ్ళని చేతితోనిమిరి ముద్దుపెట్టుకొని శ్రీహరి దగ్గరకొచ్చింది. 'శ్రీహరీ! వంట్లో కులాసాగా ఉందా' అని అడిగింది. మాతృప్రేమంటే ఏమిటో శ్రీహరికి ఆనాడు తెలిసింది. లేకపోతే ఆనాడు తను ఇంట్లోంచి పొమ్మని, ఇన్నాళ్లు వాళ్ళెక్కడున్నారో అన్నముక్క అడగకపోయినా తన దగ్గరకెందుకొస్తుంది? తల్లివేపుచూస్తూ, 'ఆ ... తమ్ముడు కులాసాగా ఉన్నాడా? జాగ్రత్తగా పనిచేస్తున్నాడా? డబ్బు సరిపోతున్నాదా?' మొదలయిన విషయాలు అయేక 'శ్రీహరీ! తమ్ముడీ నాలుగు నెలలలోనూ నూరు రూపాయిలు మిగిల్చేడు. ఆ డబ్బూ, నీకు కట్నం వచ్చినడబ్బూ పెట్టి నీ పెళ్ళి అయిందనిపిస్తే తర్వాత నేనేమయినా బాధలేదు! నీ పెళ్ళాం కాపురానికివచ్చేక చెల్లెళ్ళను తీసుకపోతాను' అంది తల్లి. తమ్ముడుచేసే కూడిక సంసారానికి లోలోన మెచ్చుకుంటూ 'అమ్మా! మళ్ళీ రెండు కుటుంబాలు ఎందుకు? ఇక్కడికి వెళ్ళిపోరాకూడదా? కోపంతోనే నన్నమాటకి ఎందుకింత పట్టుదల' అని బ్రతిమాలేడు శ్రీహరిరావు. 'దానికేంలే! నీ పెళ్ళాం నువ్వూకలసి సంతోషంగా కాలంగడిపితే నాకదే సంతోషం' అన్న తల్లి మాటలకు తిరిగి ఏమనాలో అర్థంకాలేదు శ్రీహరిరావుకి.

పెళ్ళి అయిందనిపించుకున్నాడు శ్రీహరిరావు. పెళ్ళాం కాపురానికిరాగానే తల్లివచ్చి కొడుకునీ, కోడలినీ దీవించి కూతుళ్ల నిద్దరినీ వెంటబెట్టుకొనిపోయింది. తన భార్యా తనే ఉన్నారు! భార్య చాలా అందగత్తెనని చెప్పాలి. భార్యకు సాయంగా తన చెల్లెల్ని ఉంచుదామని అనుకుని, భార్యతో సలహాచేసేడు! 'నాకేం భయమండీ' అని భార్య అనడంతో ఊరుకున్నాడు. ఆఫీసులో ఎంత చికాకులుపడ్డా, ఇంటిదగ్గరకొచ్చి భార్యను చూచేసరికి ఆఫీసులోని కష్టమంతా మరిచిపోవచ్చును! జీవితం ఇంక సుఖవంతం అవుతుందనుకున్నాడు. నెల జీతం అందగానే తన తమ్ముడికి పదిరూపాయలు పంపిద్దామనుకున్నాడు. తన తమ్ముడుతెచ్చే 50 రూ॥ ఎక్కడ సరిపోతాయ్ వాళ్లకి? యీ మాట భార్యతో అనేసరికి పాతాళభైరవీ ఆకారంతో లేచింది. 'మనకే ఎక్కువవడాన్నా వాళ్లకివ్వడం? ఆ పదిరూపాయలూ పెట్టి కొదరుకే. పొన్న మొదలగు

నవి కొనితెచ్చి నాకివ్వండి!' అన్న భార్య మాటలకి నోటమాటరాక నిలువునా నీరయిపోయేడు! 'అందం ఉంది. దానికితోడు కొంచెం చదువుకుంది. ఇదా ఆదర్శ గృహిణికుండే లక్షణం?' నాతమ్ముడూ, తల్లీ చెల్లెళ్లూ భోజనానికి చాలక ఇబ్బందిపడుతుంటే, నేను నాపెళ్లానికి పౌడర్లూ, స్నోలూ కొనిపెట్టవలసి వస్తున్నాది! ఏమైనా అంటే వీధిలోపడాలి' అని శ్రీ హరిరావు లోలోన బాధపడి ఊరుకున్నాడు.

శ్రీ హరిరావు నిత్యజీవితంలో అతని భార్యే అతని పక్కలో బల్లెమై కూర్చుంది. ఆఫీసునుంచివచ్చి 'మనసు బాగులేదు సినీమాకి వెళ్దామని శ్రీ హరిరావు అంటే' 'మరేంపనిలేకపోతేసరి! డబ్బు దండుగ' అన్నమాట తప్పకుండా అతని భార్య దగ్గర్నుంచి వస్తుంది. దాంతో శ్రీ హరిరావు కృంగి కృశించి పోతాడు. అన్నీ ఇటువంటి చిన్న సంఘటనలలోనే వ్యతిరేకభావాలుద్భవించేవి. శ్రీ హరి ఏదంటే అది కాదని, కాదన్నదానికి కడరాగం పాడుతుంటే, ఆఫీసులోనే బుర్రపాడుజేసుకొని విసుగ్గా ఇంటికొచ్చిన శ్రీ హరిరావుకి ఇల్లు నరకతుల్యంగా కన్పించేది. అందగత్తె, దానికితోడు చదువుకుంది. ఇంక అడగాలా? ఏ లాయరూ అందకుండా తర్కించి, వాదన పెంచడంతో శ్రీ హరికి తట్టుకోలేని అశాంతి చెలరేగేది. ఆమె స్త్రీ స్వాతంత్ర్యంకోసం పాటుపడితే ఎవరూ కాదనలేరు. కాని ఎవరి బాధ్యతలు వాళ్లు నిర్వర్తించాలి! స్త్రీ స్వాతంత్ర్యాన్ని ఆదర్శంగా నుంచుకొని భర్త కివ్వవలసిన ప్రాధాన్యం ఇవ్వాలా? అక్కరలేదా? ఇద్దరూ ఒకే ఉద్దేశంతో నడిస్తేనేనా సంసార సాగరం యీదగలగడం? భర్తకు అనుకూలవతియైయుండి, తన స్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకోవాలి స్త్రీ. అంతేగాని ప్రతి విషయానికీ వ్యతిరేకిగా బయలుదేరి వారి మనస్సులను కలచివేయడం స్త్రీ స్వాతంత్ర్యోద్యమ ఆదర్శమా? స్త్రీ స్వాతంత్ర్యమంటే స్త్రీ తన ఇచ్ఛవచ్చినట్లూ ప్రవర్తించవచ్చును. భర్తను తను శాసించవచ్చును అనియా? ఇదేనా ఆదర్శగృహిణి లక్షణాలు?

జీవితమంతా ఒక్క విధంగానే నడిచింది. సంతోషం, శాంతి, సౌఖ్యం నోచుకోలేదు. అవి కొనడానికి దొరికే వస్తువులా? తమ్ముడితో కలిసి ఉండినా బాగుండేది. భార్యవస్తే జీవితం, ఒక వెన్నెలబాట పడుతుందనుకున్నాడు. జీవితంలో ఇంతకంటే కనాకష్టమైన జీవితం ఇంకేది? భార్య పక్కలో బల్లెమయింది అని ఆక్రందించేడు శ్రీ హరి. కాని వినేవారేరీ? ఇటువంటి జీవితాలనుచూస్తే ఏ హృదయంకరిగి కాల్వగట్టదు? చేసే ప్రయత్నాలన్నీ విఫలమై మరోత్రోవ లేనపుడు వైరాగ్యం ఆధారం అవుతుందిగదా! నాలుగు నెలలు సెలవు పెట్టేడు! భార్యతో ప్రసంగం మానుకున్నాడు. జీవితం అస్థిరం. ప్రపంచంలో స్థిరమైన వస్తువేదీలేదు అని తనలో తానే గొణుక్కుంటాడు. ఆ నాడు రేడియోలో విన్న తత్వంయొక్క అర్థం యీ నాడు తెలిసింది. ఉద్యోగం స్థిరంచేసుకోడానికి, తాపత్రయపడ్డాడు. యీనాడు జీవితమే అస్థిరమని తెలుసుకొని, ఆ నాటి తన తెలివి తక్కువకు నవ్వుకున్నాడు. అందం ఆనందమా? ఎటువంటి అందం ఆనందం? అందంలో ఆనందముందా? ఉన్నా గుణంలేని అందం గ్రుడ్డిది. "యవ్వన మందము పోవును, క్రొవ్వెక్కిన దేహమంత గోతికి బోవున్" అన్నట్టు అందం శాశ్వతమా? అందంలేకపోయినా అనుకూలవతి అయిన భార్య ఉంటే ఆ యింటికంటే వేరే స్వర్గం ఏదీ? ఆ అనుకూలానికి అందం తోడయితే వేరే చెప్పాలా? పై రెండింటికీ చదువు సంస్కారం తోడయితే ఆ యింటిని ఏ వేల్పు పొగడగలడు?

ఎన్ని విషమపరిస్థితులొచ్చినా సంసార సాగరాన్ని దాటడానికి, ఎన్ని కష్టాలయినా నిమిషంలో మరిచిపోగలడానికి అందమయిన భార్య, అనుకూలవతియైన భార్యలలో ఎవరు తోడ్పడతారు? అందం ఆనందమా? ఎటువంటి అందం ఆనందం? యీ సమస్యలు శ్రీ హరిరావుకి ఇంకా సమస్యలుగానే ఉండిపోయేయి.

# విండర్ మియర్ సతి విసనకర్ర

రచయిత :
ఆస్కార్ వైల్డ్

అనువాదం :
సో. రామచంద్ర అగస్త్య ఎం. ఏ.

(గతసంచిక తరువాత)

విం.స:-ఇక నాకు గతి ఎవ్వరు? ఈ ఒంటరితనాన్ని ఎలాగ భరించగలను?

[పాట ఆగుతుంది. బెర్రిక్ రాణీ పైలీ ప్రభువు నవ్వుతూ మాట్లాడుకుంటూ ప్రవేశిస్తారు. బాల్ రూమ్‌నుండి తక్కిన అతిథులు ప్రవేశిస్తారు.]

బె.రా:-మార్గరెట్, ఇంతవరకూ మిసిస్ ఎర్లిన్‌తో చాలా కులాసాగా మాట్లాడేను. ఆవిణ్ణి గురించి సాయంత్రం లేనిపోని మాటల్ని చెప్పినందుకు నేను చాలా విచారిస్తున్నాను. ఆ మనిషి మంచిదికాకపోతేమీరు పిలిచేయుండరు గదా! చాలా చక్కని మనిషి. ఎంతో తెలివిగా మాట్లాడుతుంది. ఎవరైనా సరే రెండోసారి పెళ్ళాడడం తనకు సుతరాం నచ్చదు అంటుంది. అందుచేత అగస్టసుని గురించి నేను అంతగా కంగారుపడవలసిన అవసరం లేదు. లోకం ఆవిణ్ణి ఎందుకు నిందిస్తుందో నాకర్థం కావడంలేదు. వాళ్ల తస్సాదియ్యా! ఆ సెవైల్ పిల్లలున్నారు చూసేరు-వాళ్లే నామేనకోడళ్లు - వాళ్లే ఈ అపవాదుని లేవదీస్తా, అయినా నేను హేంబర్గుకి వెళ్లక తప్పదు. ఇతర్లలోలేని ఆకర్షణ ఆమెలో కనబడుతుంది. సరేకాని అగాతా ఏదీ ఓహో అదిగో (అగాతా కుమారి, హోప్పరు డాబానుండి వస్తారు) హోప్పరు గారూ, మీమీద నాకు చెప్పరానంత కోపం. అగాతా అసలే పీలగాఉంటే దానిని మేడమీదికెందుకు తీసుకు వెళ్ళేరు?

హోప్పర్ -క్షమించండి. ఏదో కొద్దిసేపట్లో వచ్చేద్దామని వెళ్లేం. కాని మాటల సందడిలో అలాగే ఉండిపోయాం.

బె.రా:-ఆ మాటలంతా ఆ స్ట్రేలియాని గురించేనా?

హోప్పర్:-అవును.

బె.రా:-అమ్మాయి అగాతా! (దగ్గరకి రమ్మని సౌంజ్ఞచేస్తుంది.)

అ.కు:-ఎందుకు అమ్మా!

బె.రా::-(చాటుగా)హోప్పరుగాని నిర్ధారణగా-

అ.కు:-అవును అమ్మా.

వేబె.రా:-ఏమిసమాధానమిచ్చేవే నాచిట్టి తల్లీ?

అ.కు:-అవును అమ్మా.

బె.రా:-(లాలనతో) నాబుల్లితల్లి! నువ్వెప్పుడూ సరిగ్గానే మాట్లాడతావు. హాప్పరుగారూ!

జేమ్స్:- అగాతా సంగతంతా చెప్పేసింది లెండి. అబ్బా ఈ సంగతిని మీరిద్దరూ ఎంత గుంభనగా ఉంచేరూ!

హా:-రాణీగారూ నేను అగాతాని ఆస్ట్రేలియాకు తీసుకుపోవడం మీకిష్టమేనా?

బె.రా:-(కోపంతో) ఆస్ట్రేలియాకా! ఆ ప్రదేశమంటే నాకు బలేభయం.

హా:-అయినా ఆవిడ నాతో వస్తానని చెప్పింది.

బె.రా:-(కటువుగా) నువ్వలా గన్నావా అగాతా?

అ.కు:-అవునమ్మా.

బె.రా:-అగాతా నువ్వెప్పుడూ తెలివితక్కువగా మాట్లాడతావు. గ్రాస్వెనర్ స్క్వేర్లో నివసించడమే మొత్తంమీద ఆరోగ్యకరమైనది. అక్కడ ఎంతోమంది పల్లెటూరి గబ్బిలాయిలు ఉన్నా, అక్కడా ఇక్కడా కంగారు పుట్టించే కంగారూలు గెంతుతూ ఉండవుగా. సరే దానిని గురించి రేపు మాట్లాడుకుందాంగాని జేమ్సుగారూ అగాతాని తీసుకువెళ్లండి. రేపు మధ్యాహ్నం భోజనానికి వస్తారుగా జేమ్సుగారూ? రెండుగంటలికి బదులుగా ఒంటిగంటన్నరకిరండి. రాజుగారు మీతో కొద్దిగా ముచ్చటించవచ్చు నాకు తోస్తుంది.

హా:-రాజాగారితో నేను తప్పకుండా మాట్లాడాలి. ఇంతవరకూ ఆయన నాతో ఒక పలుకుకూడా పలకలేదు.

బె.రా:-ఆయన మాట్లాడడం ప్రారంభిస్తే దానికి అంతుఉండదని రేపు మీకే బోధపడుతుంది.

[అగాతాకుమారి, హాప్పర్ వెళ్ళిపోతారు]

వెళ్ళొస్తా మార్గరెట్. ఇదంతా వట్టి పాతకథే అనుకో. ప్రేమ మొదటి వీక్షణాన్నే కలిగే ప్రేమకాదు, కలకాలమూ ఉండే ప్రేమ అత్యంత తృప్తికరమైనది అనే విషయాన్ని మర్చిపోవద్దు.

విం.స:-నమస్కారం రాణీగారూ.

[పైలీ ప్రభువు భుజంమీద ఆనుకుని బెర్విక్ రాణి నిష్క్రమిస్తుంది.]

ప్లిం.స:-మార్గరెట్ మీ భర్తతో నృత్యం చేస్తున్న స్త్రీ ఎంత అందంగా ఉందనుకున్నారు! నేనే యీ స్థానంలో ఉండి ఉంటే చాలా అసూయపడి ఉండేదాన్ని. మీ దగ్గిర నేస్తమా?

విం.స:-కాదు!

ప్లి.స:-అలాగా? వస్తానండి.

[డంబీవైపు చూచి నిష్క్రమిస్తుంది.]

డంబీ:-హాప్పర్ నడత మాబలే బాగుంది!

సిసీల్ గ్రహాం:-హాప్పరు చాలా అమాయకుడు. పాపం పెద్ద సంఘాల్లో ఎలా ప్రవర్తించాలో అతనికి తెలీదు.

డంబీ:-విండర్ మియర్ సతి చాలా ఉదార స్వభావ, ఇంకో స్త్రీ అయితే మిసిస్ ఎర్లిన్‌ని ఇక్కడికి రానిచ్చేదికాదు. విండర్ మియర్ సతికి అపూర్వ లోక జ్ఞానం ఉన్నది కాబట్టి ఆమె చక్కగా ప్రవర్తిస్తున్నది.

సి.గ్ర:-కాలుజారినా అమాయకుడిలా నటిస్తాడు విండర్ మియర్.

డంబీ:-అవును; విండర్ మియర్‌గారు ఇంచుమించుగా ఆధునాతనుడై పోతున్నాడు. అతడిలాగ మారతాడని నేను ఎదురు చూడలేదు.

[విండర్ మియర్ సతికి నమస్కారంచేసి వెళ్ళిపోతాడు.]

జెడ్ బరోసతి:-విండర్ మియర్ సతిగారూ వస్తానండీ. మిసిస్ ఎర్లిన్ ఎంత అందమైన మనిషి! ఆవిడ లక్ష్మీవారం మధ్యాహ్నం భోజనానికి వస్తుంది. మీరుకూడా రద్దురూ? బిషప్పుగారూ మెర్టన్‌సతీకూడా వస్తారనుకుంటాను.

విం.స: ఆ వేళ నాకింకోచోట పనిఉందండి జెడ్ బరోసతిగారూ.

జె.స:-బుచ్ రావమ్మా.

[జెడ్ బరోసతి, మిస్ గ్రహాం వెళ్ళిపోతారు]

[మిసిస్ ఎర్లిన్, విండర్ మియర్ ప్రభువు ప్రవేశిస్తారు.]

మి.ఎ:-బలేచక్కని శాల్! నాకు పూర్వపు రోజులు జ్ఞప్తికి వస్తున్నాయి.

[సోఫామీద కూర్చుంటుంది]

అప్పటిలాగే ఇప్పుడూ కావలసినంతమంది తెలివితక్కువవాళ్లు తిరుగుతూ ఉన్నారు. ఏమీమారినట్లుగానే కనబడదు, మార్గరెట్‌ని తప్పించి మహా అందకత్తెగా తయారయ్యింది. పోయినసారి ఆమెను చూచినప్పుడు ఇరవై ఏళ్ళకుముందు, ఫ్లానల్ చొక్కా తొడుగుకుని చీపురుపుల్లలాగుండేది. రాణీగారూ, అగాతాకుమారీకూడా చక్కని వ్యక్తులు. అటువంటి అమ్మాయిలంటే నాకు చాలా యిష్టం. విండర్ మియర్ గారూ, నేనేగాని ఆ రాణీగారి వదిననైయుంటే.

విండర్ మియర్ ప్రభువు:- (ఆమెకు సమీపాన్ని ఎల్ద్వారం దగ్గిర కూర్చుని) మీరు కాదుగా?

[సిసీల్ గ్రహాం, తక్కిన అతిథులూ వెళ్ళిపోతారు మిసిస్ ఎర్లిన్‌నీ, తన భర్తనీ అసహ్యంతోటీ, బాధతోటీకూడిన దృక్కుల్తో చూస్తుంది విండర్‌మియర్ సతి. వాళ్లు ఆమె ఉన్నట్లుగానే గమనించరు.]

మిసిస్ ఎర్లిన్:-అవును. ఆయన రేపు పన్నెండు గంటలికి వస్తారు. ఇవేళ రాత్రి నా అనుమతి కోరడానికి వస్తారు. అప్పుడే అడిగేరుకూడా. ఎప్పుడు చూచినా కోరుతునే ఉన్నారు. అగస్టస్‌గారు పదేపదే అదేపని చేస్తూ

ఉంటారు, అది చాలా చెడ్డఅలవాటు. రేపటివరకూ సరైన సమాధాన మివ్వనని ఆయనకి చెప్పేను. ఆయనని పరిగ్రహిస్తానను కోండి. – ఆయన భార్యగా నేను ఆయనకి ఏలోటూ కనబడకుండా చూచుకోగలను. అగస్టన్ ప్రభువుగారు ఎంతో మంచివారు ఆయన సౌజన్యం, సాధారణంగా అన్ని మంచిగుణాల్లాగే, పైపైనే కనబడుతుంది, ఆయనే ఈ విషయంలో మీ సహాయం నా కవసరం.

విం.ప్ర: అగస్టస్ ప్రభువుని పురిగొల్పాలా ఏమిటి?

మి.ఎ:–అక్కే అదికాదు. నేను ప్రోత్సహించగలను. మీరు నాకు వివాహానికి తగిన ఆస్తిని ఇవ్వాలి. ఏమంటారు విండర్ మియర్ గారూ?

విం.ప్ర: కోపంతో ఇవాళరాత్రి మీరు నాతో మాట్లాడదలిచింది ఇదేనా?

మి.ఎ:–అవును.

విం.ప్ర:–చిరాకుతో దానిని గురించి ఇక్కడ నేను మాట్లాడదల్చుకోలేదు.

మి.ఎ:–నవ్వుతూ అలాగైతే మేడమీదే మాట్లాడుకుందాం. ఏవిషయానికైనా చక్కని వాతావరణం ఉండాలిగా? చక్కని వాతావరణంలో స్త్రీలు ఏదైనా చెయ్యగలరు.

(సశేషం)



110 పేజీ నుండి

కుటుంబాలలోని వారిలో సయితం మానసిక పరివర్తనకు యీ చిత్రము విశేషముగా తోడ్పడవచ్చును.

స్వార్థముకొరకు రూప ప్రదర్శించిన అఘాయిత్యము, కన్నయ్య వెర్రిపోకడలు సంఘంలో నిత్యజీవితంలోని ఘట్టాలను స్మరణకు తెస్తున్నవి.

శ్రీరంజని, రామచంద్రన్ తమ పాత్రలను చక్కగా నిర్వహించారు. మిగిలినవారు సహజంగాను, తృప్తికరంగా నటించారు.

సంగీతము అధునాతన పోకడలతో మనోజ్ఞంగా నున్నది.

ఇందులో హాస్యరసం సహజధోరణిలో పోషించబడి ఆహ్లాదకరంగా నొప్పింది.

ఇది ఆదర్శప్రాయమైన సాంఘిక చిత్రం. అధిక వ్యయం, ఆర్భాటము, ఆడంబరము లేకుండా సాంఘిక పురోభివృద్ధికి వినియోగపడేలాగ నిర్మించబడినదీ చిత్రము. మాటలు, పాటలు చాల పొందికగా నున్నవి. ప్రజాజీవితమును తీర్చిదిద్దగల యీ చిత్రము దేశము త్తంమీద ఆదరాభిమానములకు, ప్రశంసలకు పాత్రముకాగలదు.






# భక్త సేవ

గోవులన్నియు నిండ్లకుఁబోవుచుండె
నండజములన్ని తమగూండ్ల కరుగుచుండె
నపుడు గృహమును జేరియా యమృతకరుఁడు
నీరసంబున కురిచీనఁ జేరఁబడియె

శస్త్రవైద్యమందాతఁడు సాటిలేని
ఖ్యాతి నార్జించి జనులను గాచుచుండె
మానవుల సేవయే చేర్చు మాధవునని
తలఁచుచుండెడి భక్త రత్నంబతండు.

అంత నొకపేద పూఁబోఁడియతనిఁ గదిసి
తనదు భర్తకు గాయంబు తగిలె నంచు
నపుడె రమ్మని పిలువఁగ నతఁడు తనకు
వలను గాకయున్నను బల్కె వత్తుననుచు.

అపరిమితముగ నాతఁడు నలసియుంట
నప్రయత్నంబుగా నిద్ర యావరించె
తలను గురిచీకిఁ జేరిచి తత్క్షణంబ
మేను మఱచెనాతండు నిమేషమునను

గోవులన్నియు నడవికిఁ బోవుచుండె
పక్షులన్నియు గూండ్లను వదలుచుండె
నపుడు మెలఁకువ గలుగఁగ నమృతకరుని
స్మృతిపథమునకు వచ్చె నాయతివ పిలుపు.
"అకట! నేనెంతటి మఱపు నందియుంటి"
ననుచు నామెనాథునకును నయముసేయ,

లేచి యశ్వంబు నెక్కి యా రేయితన్ను
బిలిచిన సుదతి యిలుసేరఁ, దలుపుఁ దెఱచి
విస్మయంబంది యా కాంత వేడ్క మీఱ
"మగుడ వచ్చితి రేలయో మాన్యచరిత!
రాత్రి కట్టిన కట్టు నా ప్రాణపతికి
జీవముల నిచ్చి కాచె, మీచేతి చలువ!
అహహా! యిది యెల్ల భవదీయ హస్తగుణము"
యనుచు నాతనిఁ బొగడెడు నాసుదతిని
నద్భుతముతోడఁ గాంచుచు నమృతకరుఁడు
నేమితోచని మనసుతో నిటుల పలికె
"అమ్మ! నీభర్తఁ గాంచఁగ నభిలషించి
వచ్చితిని తల్లి, మఱియెట్టి పనియు లేదు
సెలవుఁ గైకొందు" నని పల్కి శీఘ్రముగను
గృహము జేరి, దేవుఁదలచి, కేలు మోడ్చి,
"మాధవా! యిదియెల్ల నీమాయ గాదె!
యలసి మఱచి నిద్రించు నీ యల్పుఁదలచి
స్వయముగా వచ్చి యా పేదవాని, నీవె
ప్రాణములఁ గాచితి గదయ్య! భక్తవరద!
బీదసాదల దీనులఁ బ్రేమఁ జూచి
యలసట యనక రక్షింతు వనవరతము
నిదియె నీభక్త సేవగా నెన్నుచుందు"
ననుచుఁ దలవాంచె భక్తితో నమృతకరుఁడు.

కుమారి సుందరి

# ముద్దు పేరు

శ్రీ పోలాకి శ్రీనివాసరావు

మంగయ్య సామాన్య గృహస్థుడు. తనూ తన భార్యా గంగమ్మ చెప్పుకో తగ్గ ఆస్తి లేకున్నా కూడూ గుడ్డకు కొదువలేకుండా కాలక్షేపం చేస్తూన్నారు. ఈ దంపతులకు చాలాకాలంవరకూ సంతానం కలగలేదు. ఎన్నో దేవుళ్లకు దయ్యాలకు మొక్కారు. గుట్టలెక్కారు. జాతరలు సేవించారు. జాగరాలు సలిపారు. ఉపవాసాలూ వ్రతాలు సలిపారు. ముడుపులు ముళ్లు వేశారు. బైరాగులను బ్రతిమాలారు. జోస్యులకు జోహార్లుచేశారు. దాసులకు దాసులై మెలిగారు. కొన్నాళ్లకు ఒక పుత్రుణ్ణి కన్నారు. ఈ పిల్లవాణ్ణి బంధువులూ, పెద్దలూ "మూర్తి" అని నామకరణం చేశారు. తమ పిల్లలు పెద్దగా పెరిగి చిరకాలం జీవించెదరన్న విశ్వాసంతో తలారి, వెట్టు, కరవుదండగు, దండాసి మొదలగు పేర్లు పెట్టి పిలిచే రీతిగానే మూర్తికి తన తల్లి దండ్రులు "బయ్యా!" అని ముద్దుగా పిలుచుచుండేవారు. మరియు, అతి గారాబంగా పెంచుతూ పెద్దజేసి తరతరములనుండి వారి వంశంలో చదువుకొన్నవారు లేకున్నా సాధారణ విద్య చెప్పించారు. కొన్నాళ్లకు సమీప గ్రామములో ఒక చిన్న ఉద్యోగం లభించింది మూర్తికి. ఉద్యోగం లభింపగానే గర్వంగాను, తనంత వాడు లేరనే స్వాతిశయంతోనూ వ్యవహరిస్తూ ఆడంబరముగా నటించడాని కారంభించాడు. తను కాపురము చేయుచున్న గ్రామంనుండి ఉదయాన్నే కేరియరులో భోజన పదార్థాలు తీసికొని సైకిలుపై ఉద్యోగం చేయుచున్న గ్రామానికి పోయేవాడు. అక్కడ మధ్యాహ్నం కేరియరులోని భోజనాన్ని భుజించి సాయంకాలానికి తిరిగి తన స్వగ్రామానికి చేరుకొనేవాడు. ఈలా ఉదయ సాయంకాలములు ప్రయాణం చేయు కాలంలో తన సైకిలునకు త్రోవలో పొరబాటున ఎదురైన వారికి గాని, సమీపమున నున్నవారికిగాని కోపించేవాడు. ఈలాంటి సంఘటనాలు తరచుగా పశువులు కాచే పిల్లల వలన కలుగుచుండేవి. వాళ్లను కోపించి కొట్టబోయేవాడు.

ఒకనాటి ఉదయాన్నే లేచి తన గ్రామంలో తన యింటి వరండాపై దంతధావన చేస్తూ కూర్చున్నాడు మూర్తి. మూర్తి యింటి కెదురుగా ఒక ధనవంతుని మేడ కట్టబడుతూంది. ఆ మేడ కొరకు పొరుగూరి నుండి కొందరు బండ్ల వాళ్ళు కొన్ని బండ్లలో రాళ్లను తెచ్చి మేడ వాకిట బండ్లను విప్పారు. వారు పశువులను బండ్లకు కట్టి రాళ్లను మోసి పోగులు పోయుచున్నారు. ఒక బండినుండి దున్నపోతొకటి కట్టు వీడి పోవుచుండగా బండ్ల

వాండ్లలో నొకడు "ఓరి బయ్యా! బయ్యా! నీ దున్నపోతొకటి కట్టు వీడి పైగా పోవు చున్నది. అదలించి తెచ్చి బండికి కట్టుము" అని కేక వేశాడు. మనమూర్తికి ఈ కేకలు చెవిలో శూలాలవలే నాటినయి. ముఖం జేవురించింది. తోక త్రొక్కిన త్రాచులా మహా పౌరుషంతో ఆ బండి వానిని నానా దుర్భాషలాడి కర్రతో కొట్ట బోయాడు. మూర్తి అకారణంగా కలహానికి కాలు దువ్వుచున్నాడన్న కోపం భరింపలేక మూర్తిపై హుంకరించాడు బండివాడు. తనతో నున్న బండ్లవాళ్లున్నూ మూర్తిని కొట్టబోయారు. ఈ కలహమేమిటో తెలియని మూర్తియొక్క తల్లిదండ్రులు, స్నేహితులు మొదలైనవారు వచ్చి కలహంలో పాల్గొన్నారు. ఇరు కక్షుల వారూ హోరా హోరుగా పోరాటానికి సమకట్టారు. ఇంతలో గ్రామములోని పిన్న పెద్దలచ్చటికి చేరారు. మేడను కట్టించుటకు తలపెట్టి బండ్ల వాండ్లను రావించిన ధనికుడక్కడికి వచ్చాడు. కలహాన్ని శాంతింపజేశాడు. తన గ్రామస్థులకూ బండ్ల వాండ్లకూ కలహము కలుగుటకు కారణమేమని ప్రశ్నించాడు. మూర్తి తనను "బయ్యా! బయ్యా!" అని హేళనగా పిలిచ్చి బండివాడు అవమానం చేశాడని తెలిపాడు. బండివాడు, తమ బండ్ల వాండ్లలోకూడా 'ఒక బయ్యాపు'న్నాడని, ఆతని దున్నపోతు కట్టు వీడి పోవుచుండగా ఆ "బయ్యాను" పిలిచి తెలియజేశానని, అంతలో యీ మూర్తి నానా దుర్భాషలాడి తనను కఱ్ఱతో మోదవచ్చాడని తెలియజేశాడు.

ఈ కలహ కారణం తెలిసికొన్న అక్కడి ప్రజలందరూ పొట్టలు పగిలేటట్టు నవ్వి, మందబుద్ధిగల మూర్తిని మందలించారు.

ఈ వార్త మూర్తి గ్రామమునుండి తను ఉద్యోగము చేయుచున్న గ్రామము వరకు ప్రాకినది. గర్వమే నైజగుణముగల మూర్తి తను ఉద్యోగము చెలాయించు చున్న గ్రామానికి 'సైకిలుపై పోవు చున్నాడు. ఈతని గుణాలను గుర్తెరిగిన కొందరు పిల్లలు మార్గములో పశువులు కాయుచున్నారు. ఒక పిల్లవాడు తన బత్తెను పిలిచెడి నెపంతో కొంటెగా "ఏయ్ - బయ్యా! ఏయ్ - బయ్యా! నిలు నిలు!" అని కేక వేశాడు. తతిమ్మా పిల్లలుకూడా "ఏయ్ - బయ్యా! నిలు నిలు" అని కేకవేశారు. ఆగతాయి పిల్లలను అదలించినా తమ కొంటె గుణాలు వీడకుండిరి. మూర్తి చేయునది లేక ఉద్యోగ గ్రామానికి పోయాడు. అక్కడా: యీలాంటి సంఘటనాలే కలిగాయి, తిరిగి యింటికి పోవుచున్నపుడూ

యీలాంటి సంఘటనాలే సంభవిస్తూండేవి. ఈ అవమానాన్ని భరింపలేక వేరొక ప్రాంతానకు ఉద్యోగం మార్చు కొన్నాడు. అక్కడకూడా యీలానే కొంటె పిల్లలు "బయ్యా! — బయ్యా! నీవు అలుగకుంటే అనముసుమా "అని కేలి సేయుట ప్రారంభించారు. ఎక్కడకు పోతే యీ బయ్యానామము మాయమవుతుందో నని పరితపించేవాడు. బయ్యా అంటే వెఱ్ఱి వాడని వేరొక భాషలో అర్థము. బయ్యా అంటే వెఱ్ఱివానివలె మూర్తి అలుగుట వలన తల్లిదండ్రులు పెట్టిన ముద్దు పేరు యితనికి సార్థక మయిందని చాలా మంది తలపోశారు.

---

(66 పేజీ తరువాయి)

భాగత సంస్కృతీ శుభగభస్తి చయమ్ముల దివ్యకాంతి వి
స్ఫారగజేసినట్టి ప్రతిభా సుభగత్వముచే విశిష్ట స
త్కారము లందుకొన్న గతగాథల దృష్టినిల్పి నేడిదే
తోరణమాలగట్టుము గతోన్నతి సృష్టియొనర్ప సోదరీ ॥

అబలాత్వమును మీర కష్ట కష్టములొంది-సీతమ్మ సాధ్వీత్వ నీతిఁ దెలిపె
మహిళాత్వమున దేశమాన్యతల్ బెంచుచున్-రుద్రమ్మపాలనా ముద్రగొనియె.
ఆధ్యాత్మ గురువౌచు అఖిల దిఙ్నుతులొంది-శారద, సతికి బ్రశస్తిబెనిచె
ప్రజ్ఞాన నిధియైన పతిశీల ప్రమద సూ-యనికలిన్ కస్తూరి యశమునిలిపె
ఉవిదల కసాధ్యమా కార్యమున్నె ?- స్త్రీత్వమును సుంతవీడకే ధీరదీక్ష
భారతీసేవ జాతివై భవముగూర్చి,-దేశమాతృణమున్ దీర్ప దెమలిరండు ॥

కొలది మార్పులతో బెజవాడ ఆలిండియా రేడియోవారి సౌజన్యంతో

---

"తన భార్యతో మాట్లాడడము మానకపోతే నన్ను కాల్చిచంపుతానని ఒకడు వ్రాశాడు. అది చాల ఆందోళనాకరంగా నున్నది."

"ఆందోళన ఎందుకూ! అతని భార్యతో మాట్లాడటం మానేస్తే సరి"

"అది సరే - కాని ఆ జాబులో సంతకమనేది లేదే"

చిత్ర సమీక్ష

# మన ప్రస్తుత సాంఘిక పరిస్థితుల ప్రతిబింబము
# 'రాజీ-నా ప్రాణం'

### శ్రీ సి. సి. పున్నయ్య

జెమినీవారి తెలుగు చిత్రము 'రాజీ-నా ప్రాణం' జనవరి 27-న ఉదయం పత్రికా ప్రతినిధులకు జెమినీ స్టూడియోలోని థియేటరులో ప్రదర్శించబడింది. ప్రముఖ పత్రికా రచయితలనేకులు ప్రదర్శనమునకు హాజరైరి.

వినోదంతోబాటు సంఘపురోభివృద్ధి నుద్దేశించి సంఘంలో విప్లవాత్మకమైన మానసిక పరివర్తనమును ప్రబోధించునదిగా యీ చిత్రము తయారైనది. ఇట్టి ఉత్తమ చిత్రమును నిర్మించినందుకు శ్రీ యస్. యస్. వాసన్‌గారు అభినందనీయులు.

కథావస్తువు పువ్వులమ్ముకొని జీవించే గ్రుడ్డి దీనురాలు రాజీ జీవితచరిత్రగా ప్రారంభమయినా యిందులో అదృష్టానికి, దురదృష్టానికిగల తారతమ్యము, సంపన్నుల నిరంకుశ జీవితము, న్యాయము పేరట జరుగుచున్న ఘోరాన్యాయములు, పరోపకారాన్ని, పరులశ్రేయస్సు నుద్దేశించిన త్యాగధనుల జీవితాలు ప్రజాసామాన్య జీవితంలో హత్తుకునేలాగ చిత్రించబడినవి.

ఇందులో 'రాము' జీవితం మహోత్తమ స్థానాన్ని అలంకరించింది. దీనావస్థలోనున్న రాజీని కనికరించి తోడునీడై పోయినదృష్టిని రప్పించడానికి పడరాని పాట్లుపడిన ఫలితంగా కారాగారవాసము ప్రాప్తించింది. వారిద్దరిమధ్య వర్ధిల్లిన అనురాగమునకు అంతరాయంవచ్చింది. చెరసాలనుండి విముక్తుడుకాగానే రాజీ, జీవితంలోవచ్చిన మార్పులనుచూచి విశాల హృదయంతో 'తాను శ్రమపడినది రాజీకి మరల చూపువచ్చి ఆనందంగా జీవయాత్ర చేయడానికేకదా' యని తృప్తిపడి ఆమెను, కుటుంబాన్ని ఒక్కసారి చూచి ఆనంద భాష్పాలతో ఒక రోజా పుష్పాన్ని వారినుండి గ్రహించి మానవాతీతుడుగాను, త్యాగధనుడుగాను, రాము జీవితరంగానుండి నిష్క్రమించాడు.

తనకు తోడునీడై తనకు చూపు రావడానికి కారకుడైన రాముపట్ల రాజీ అనురాగము పవిత్రమైనది, గాఢమయినదికూడాను. కాని తన అత్త చనిపోయి ఏర్పడిన విషమపరిస్థితుల ఫలితంగా నిరాధారయై ఆత్మహత్య చేసికోబోయిన సందర్భమున తనకు నేత్ర చికిత్సచేసిన డాక్టరు తల్లి, చెల్లెలు కాపాడి తమ యింట్లో నుంచుకున్నారు. డాక్టరు రాజీని తన నర్సింగ్ హోములో నర్సుగా నియామకం చేశాడు. నిత్యమూ రామును స్మరిస్తున్న రాజీని తాను గాఢంగా ప్రేమిస్తున్నా బయటికి చెప్పలేకపోయాడు. తీరా బయటికి చెప్పేసరికి వాళ్ల యింట్లోనుండి పరారికావడానికి ప్రయత్నించగా రాజీని డాక్టర్‌తల్లి వారించి 'కలగానే మిగిలిపోయిన రాము యిక కనుపించడు. తనకు ఒక్కడే కొడుకైన డాక్టర్‌ను వివాహమాడి ఆయన్ని, ఆయన కుటుంబాన్ని కాపాడ'మని ప్రాధేయపడింది. ఆ క్షణంలో రాముతో తను గడిపిన జీవితం కలగానే తోచియుండవచ్చును. లేదా 'రాము' తిరిగి వస్తాడనే నమ్మకం నశించియుండవచ్చును. నిరాధారగానున్న తనకు చూపును ప్రసాదించి, ఆశ్రయమిచ్చి పోషిస్తున్న డాక్టర్, డాక్టరు కుటుంబము విచ్ఛిన్నంకావడానికి రాజీ తానెలా కారకురాలుకాగలదు? డాక్టరును వివాహమాడి, బిడ్డతల్లి అయింది. ఆ బిడ్డకు 'రాము' అనే నామకరణంచేసింది.

ధనికుని విలాసమయమైన జీవితం, నిరంకుశత్వము సహజంగాను, చక్కగాను చిత్రించబడినవి. సంపన్న

105 పేజీ చూడుడు




**శ్రీ వేంకటేశ్వరుని కల్యాణము : నే. వేం. కోటీశ్వర శర్మగారు. ప్రచురణకర్త: ఆ. వేంకటశాస్త్రిగారు, 17 గోవిందరాజ తేరు వీధి, తిరుపతి. వెల 0-1-0**

ఇది దసరాగేయముగా శ్రీ వెంకటేశ్వర స్వామికి కల్యాణము రచింపబడిన చిన్న పుస్తకము. గ్రామాంతరాలలోని బాలబాలికలను ఆకర్షించి, కంఠస్థముచేసి పాడుకొనుట కనువుగానున్నది. భగవత్ లీలలు బాలలో సయితం ప్రచారమునకు యిట్టి గేయములు విశేషముగానుపకరించును.

**మాలిక: శ్రీదూతలూరి జగన్నాథం, అన్నదారి, ఊతుకోట పోష్టు, చెంగల్పట్టు జిల్లా వెల 0-10-0**

ఇది ఖండకావ్యముల సంపుటి. పుష్పప్రశంస, రైతుఘనత, చేనేత, సంక్రాంతి మొదలగు పన్నెండు చిన్నచిన్న కావ్యములు సరళమైన భాషలో మనోరంజకంగా రచింపబడియున్నవి.

**క్షేత్రయపదములు : సంపాదకుడు డాక్టర్ గిడుగు వేంకటసీతాపతిగారు. ప్రచురణకర్త శ్రీ పిఠాపురం మహారాజావారు. ప్రతులకు డాక్టర్ జి. వి. సీతాపతిగారు, 9 ఆఫీసు వెంకటాచలముదలి స్ట్రీటు, ట్రిప్లికేను, మద్రాసు. వెల రు 8-0-0**

దక్షిణదేశంలో క్షేత్రయకు సంగీత, సాహిత్య, నృత్యరంగాలలో గలస్థానము విశిష్టమైనది. వారి మువ్వగోపాల పదములరచన కర్ణాటక సంగీతాభివృద్ధికి, సంగీత కళాసంస్కరణలకు ఎక్కువగా తోడ్పడి, ప్రఖ్యాత కృతి కర్తలయొక్కయు, వాగ్గేయకారుల యొక్కయు ప్రశంసలకు పాత్రమైనవి.

సంగీతము, సాహిత్యము, నృత్యము ఒక దానిపై నొకటి ఆధారపడి వ్యక్తిగతంగా దేనికది విశిష్టతను కాపాడుకొంటూ భావ, రాగ, తాళ సమన్వయంతో భక్తి, రక్తి, ముక్తులను ప్రోత్సహిస్తున్నవి క్షేత్రయపదములు. ఇందులో భావప్రదర్శనమును మనోహరంగా అనువైన పదజాలంతో చేసిన ప్రతిభాశాలి క్షేత్రయ. ఈ పదములందలి వర్ణనలు స్వభావసిద్ధములు. వర్ణితాంశములు తన్మయత్వంతో కనులకు కట్టినట్లు చిత్రించబడియుండుటచే నాట్యాభినయములకు తగియున్నవి. ముఖ్యంగా కూచిపూడిభాగవతుల మువ్వగోపాల పదముల అభినయము చూచి ఆనందించవలసినది.

క్షేత్రయభక్తి పారవశ్యం యిట్టి ఉత్తమరచనను ప్రసాదించినది. జాతీయజీవితంలోని ప్రధానాంశములు - కళారాధన, కళాపిపాసలు సర్వప్రజానీకంలో వ్యాప్తికావలసిన యీ రోజులలో ప్రజలు, ప్రభుత్వముకూడ లలితకళల అభివృద్ధి పట్ల విశేషమగా ఆసక్తి చూపవలసియున్నది. ఈ సందర్భమున యీ గ్రంథము విశేషముగా ప్రచారములోనికి రాగలదని మా నమ్మకం.

చక్కని ముద్రణ, తయారీ యిందులోని ప్రఖ్యాతవాగ్గేయకారులు, కళారాధకుల అభిప్రాయపూర్వకమైన పరిచయ వాక్యాలు యీ గ్రంథమునకు ఒక ప్రత్యేకత.

**వయోజనసులభవిద్య : రచయిత, ప్రకాశకుడు : శ్రీ పోలాకి శ్రీనివాసరావుగారు, బూరవల్లి (వయా) ఆమదాలవలస, శ్రీకాకుళంజిల్లా వెల 0-4-0.**

ఇప్పుడిప్పుడే వయోజన విద్యపట్ల ప్రభుత్వము, ప్రజలు చూపుచున్న ఆసక్తికి కారణభూతులైన ప్రముఖులలో శ్రీ శ్రీనివాసరావుగారొకరు. వారి పరిశోధనా పూర్వకమైన కృషిఫలితంగా వెలువడిన రచనలలో యీ చిన్న పుస్తకమొకటి. ఇందులో వయోజనులను సులభంగా, శీఘ్రకాలంలో అక్షరాస్యులుగావించు విధానము వివరించబడింది. వయోజనవిద్యా కేంద్రాలలోను, పాఠశాలలకు యీ పుస్తకము విశేషముగానుపయోగపడి ప్రజలకు అత్యంత ప్రధానవసరమయిన విద్యావ్యాప్తికి తోడ్పడగలదని మా నమ్మకం.

**శ్రద్ధాంజలి : రావు వేంకటశేషారావుగారు. చిత్రాడ, పిఠాపురం పోష్టు, తూర్పుగోదావరిజిల్లా వెల రు. 1-0-0**

ఇది పద్యకావ్యము. ఈ గ్రంథరచన గ్రంథకర్త అన్నగారి కుమారుడు శ్రీ రావు వేంకటఅచ్యుతరావుగారి మరణంవలన ఏర్పడిన ఆవేదనా ఫలితంగా ప్రారంభమయి యీ గ్రంథ విక్రయమువారి కీర్తి విశ్రుతమగుటకు, వారిస్మృతి నిధికి విరాళముగా సేకరించి దానిపై వచ్చు వడ్డీని అర్హతగల విద్యార్థినీ విద్యార్థులకు వార్షిక సమావేశసమయములందు బహుమతులిచ్చుటకు వినియోగపడాలనే యుద్దేశంతో యీ గ్రంథము వెలువడింది.

ఇందులో అశ్రుతర్పణంతో బాటు భ్రమరగీతము, సంఘ సంస్కారి! వీరేశలింగసుకవీ!!, పుత్రప్రేమ, మైత్రి, మర్యాద రామన్న తీర్పులు మొదలగు శీర్షికలతో విభజించబడి ఖండకావ్యముగా రూపొందింది.

**శ్రీమద్భాగవత మహిమ : మిన్నికంటి గురునాధశర్మగారు, బ్రాడీపేట 5-వ లైను, అరండేలు పేట పోష్టు, గుంటూరు. వెల 1-8-0**

పేరునుబట్టియే యీ గ్రంథమందలి వస్తువు తెలిసికొనుట సులభము. భారత భాగవత గ్రంథాలను యిట్టి చిన్నచిన్న గ్రంథాలుగా వివరించగలవి అత్యంత ఆవశ్యకము. సర్వప్రజానీకానికి భారత భాగవతాది గ్రంధములందలి విషయాలు కరతలామలకం కావడానికి యీప్రయత్నం చాల ఉపయోగకారి.

పైగా గ్రంథకర్త పండితుడు, వేదాంతి, భాగవతమందలి అంశములను గద్య, పద్యరూపములలో రచించి ప్రజలలో భక్తిని, ముక్తిని ప్రోత్సహించడానికి, విజ్ఞానార్జనకు విశేషంగా తోడ్పడ్డారు. ఈ గ్రంధము చదివినదానివలన అనేక భాగవత విశేషములు తెలియగలవు.

—— (0) ——

ఒక రైలు పెట్టెలో జనం కిటకిటలాడుతున్నారు. ఒక కుర్రాడు తన ఎదురుగా నిలబడియున్న లావాటి వ్యక్తిని అదే పనిగా చూస్తున్నాడు.

"ఎందుకు నావైపు అలాగ చూస్తున్నావు?"

"మిమ్ములనుతప్ప మరేమి చూడడానికి సందు కనుపించడంలేదు."



# సంపాదకీయములు

## సంఘసేవలోని బాధ్యతలు

ఆంధ్రదేశానికి ప్రత్యేకంగా రెడ్‌క్రాస్, సెయింట్‌జాన్ అంబులెన్స్, గిల్డ్ ఆఫ్ సర్వీస్ - మూడు సంస్థలను స్థాపిస్తూ జరిగిన సమావేశంలో ఆంధ్రగవర్నర్ దంపతులు, మంత్రులు, అనేకమంది సంఘసేవకులు పాల్గొన్నారు. సాంఘిక రంగంలో మానవసేవ నిమిత్తం యీ మూడు సంస్థల స్థాపనకు పూనుకొనిన గవర్నర్ దంపతులు అభినందనీయులు.

ఈ సమావేశంలో గవర్నర్ శ్రీ త్రివేదిగారు ఉపన్యసించుచు 'కష్టాలలోనున్నవారిని ఆదుకోడానికి చేసే మానవకృషిలో అనుభవముపొందిన సేవకులు, స్వచ్ఛందసేవకుల అవసరం చాల యున్నది. సంఘంలో ఉన్నతస్థితియందున్నవారు తీరికసమయాలను తక్కువస్థితిలోనున్నవారి సహాయంకొరకు వినియోగించేటట్లు తగుఏర్పాట్లుచేయడం అవసర'మని నొక్కి వక్కాణించారు.

పైమాటలు శ్రీ త్రివేదిగారు ఉదార హృదయంతోటి, విశాల దృక్పథంతోటి చెప్పినవి. ఉన్నత స్థితిలోనున్నవారి తీరికసమయాలు, అవకాశాలు తక్కువ స్థితిలోనున్నవారి జీవితంలోని సాధక బాధకముల నర్థముచేసికొని, సానుభూతి, సహకారములతో సహాయముచేయుటకు వినియోగపడటం వాంఛనీయం. అందుకుగాను విశేషంగా కృషిజరుగాలి. ఆకృషిని యీ స్థాపించబడిన సంఘసంస్థలు సాగించగలవనునది నిశ్చయము. కాని శ్రీ త్రివేదిగారు చెప్పినట్లు సంఘంలో మానసికమైన పరివర్తనంతేగల అనుభవముపొందిన సంఘసేవకులు, స్వచ్ఛంద సేవకులు అవసరం. ఈ కృషికి ప్రజలు విశేషంగా తోడ్పడి రాష్ట్రసాంఘిక పురోభివృద్ధికి తోడ్పడాలని మా విజ్ఞప్తి.

## ఇండియా సమస్యల పరిష్కారము

విద్యావంతులు ఎక్కువగా గ్రామాభివృద్ధి కార్యక్రమాలలో పాల్గొంటేనేకాని ఇండియా సమస్యలు పరిష్కారంకావని కాశీహిందూ విశ్వవిద్యాలయపు విద్యార్థుల సమావేశంలో ప్రజాసోషలిస్టునాయకుడు శ్రీ అశోక మెహతా పేర్కొన్నారు. ఇది కొత్త విషయంకాకపోయినా గాంధీజీ నిర్వచించిన నిర్మాణ కార్యక్రమంలోని యీ ప్రధానాంశము మరొకసారి ప్రజల దృష్టికి తేబడినది. విద్యావ్యాప్తి, గృహపరిశ్రమల వ్యాప్తియొక్క విశిష్టత, సాంఘికంగా మూఢనమ్మకాలకు, పూర్వాచారాలకు స్వస్తిచెప్పడం, ఆర్థికంగా ప్రతికుటుంబము దైనికావసరాలను గడుపుకుంటూ సుఖంగా జీవయాత్ర సాగించడం మొదలగు సమస్యలకు సంబంధించిన సమస్యల పరిష్కారానికి వలసిన విజ్ఞానవ్యాప్తి, దాని ననుసరించినకృషి అమలుజరుగాలి. ఇందుకుగాను పూర్తిగా ప్రభుత్వముమీద ఆధారపడటంవలన ప్రజలకుగలుగు మేలుకంటె విద్యావంతులు గ్రామాలలోని ప్రజలకు అన్ని రంగాలలోను సహాయపడుట చాలమేలు. గ్రామాలు పురోభివృద్ధిదశలోనున్నప్పుడు మనదేశం మొత్తము సర్వతోముఖాభివృద్ధి నొందగలదు.

—(o)—

# శ్రీ విజయనామ సం॥ర మాఘ-ఫాల్గుణ మాసములు

| | | | |
|---|---|---|---|
| 1954 సం॥ ఫిబ్రవరి నెల | 16 | మం | చతు 42-1 పుష్య 15-10 వరా 1-57 మొ 3-38 క |
| | 17 | బు | ○ పూ 44 1 ఆశ్రే 18-6 వతే 2-28 మొ 4 11 క |
| | 18 | గు | బ. పాడ్యమి 47-2 మఘ 22-4 వరా 11-55 మొ 1-39 క |
| | 19 | శు | విదియ 50-50 పూఫ 32-41 త్యా 4-12 వరా 1-6 మొ 2-51 క |
| | 20 | శ | తదియ 55-15 ఉఫవతే 4-44 మొ |
| | 21 | ఆ | చ 59-58 హ 38-39 శేవ ఉ 6-29 క తిర్గివర్జ్యంలేదు |
| | 22 | సో | పం. 60 10 చిత్ర 44-16 వ ఉ 6-36 మొ 8-21 క |
| | 23 | మం | పం 4-49 స్వా 50-9 శేవ ఉ 8-0 క త్యాజ్యాభావః, తిరిగివర్జ్యంలేదు |
| | 24 | బు | ష 9-22 విశా 55-37 వ ఉ 8-33 మొ 10-18 క |
| | 25 | గు | స 13-24 అనూ 60-10 వ ఉ 8-58 మొ 10-42 |
| | 26 | శు | అ 16-39 అనూ 0-35 వప 12-34 మొ 2-16 క నవమీతిథిః |
| | 27 | శ | న 18-53 జ్యే 4-28 వసా 4 31 మొ 6-11 క దశమీతిథిః |
| | 28 | ఆ | ద 20-4 మూ 7-20 వ ఉ 7-37 మొ 9 17 క ఏకాదశీతిథిః |
| | 1 | సో | ఏ 20-0 పూషా 9 0 వసా 6-0 మొ 7-37 క ద్వాదశీతిథిః |
| | 2 | మం | ద్వా 18-40 ఉషా వప 2-6 మొ 3-41 క త్రయోదశీతిథిః |
| | 3 | బు | త్ర 16-13 శ్ర 8-47 వప 1-42 మొ 3-15 క మహాశివరాత్రి |
| | 4 | గు | చతు 12-29 ధ 6 49 వప 3 54 మొ 5-26 క |
| | 5 | శు | ● అమా 7-50 శత 4-1 వప 1-55 మొ 3 25 క |
| | | | **ఫాల్గుణమాసం** |
| 1954 సం॥ మార్చి నెల | 6 | శ | శుద్ధపాడ్యమి 2 21 ఏప్వా 53-42 పూ.భా వప 3-19 మొ 4 48 క |
| | 7 | ఆ | తదియ 49-42 రే 51-28 వప 3 45 మొ 5-14 క |
| | 8 | సో | చ 43-33 అశ్వ 46 54 వ ఉ 9 21 మొ 10-50 క |
| | 9 | మం | పంచమి 37-24 భ 42-44 వ ఉ 9 57 మొ 11 27 క |
| | 10 | బు | ష 31-43 కృ 38-53 వప 10-33 మొ 12 3 క |
| | 11 | గు | స 27-24 రో 35-58 ది 16-57 వప 1-0 మొ 2-31 క |
| | 12 | శు | అ 22-5 మృ 33-55 వతె 5-1 మొ॥ అష్టమీతిథిః |
| | 13 | శ | న 19-58 ఆ 32-57 వ ఉ 6-25 క త్యాజ్యాభావః, తిరిగివర్జ్యంలేదు, తిథిద్వయం |
| | 14 | ఆ | ద 18-15 పున 33-11 వ ఉ 7-25 మొ 9-1 క |
| | 15 | సో | ఏ 17-51 పుష్య 34 41 త్యాజ్యాభావః, ద్వాదశితిథిః, సర్వోపవాసః |

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press, Kesari Kuteeram Ltd.
15, Westcott Road, Royapettah, Madras.
Founder-Editor : Dr. K. N. Kesari; Ag. Editor : C. C. Punniah.

# గృహలక్ష్మి ప్రచురణలు

| | | |
|---|---|---|
| 1 | నాచిన్ననాటి ముచ్చట్లు : శ్రీ కే. యస్. కేసరిగారు | 3 0 0 |
| 2. | ఫిలోమెనా తంబుచెట్టి జీవితచరిత్ర (ఆంగ్లము) | 0 12 0 |
| 3. | నవమణిమాల (నవల, తమిళం) : శ్రీమతి యస్. ఆర్. జయలక్ష్మి | 0 12 0 |
| 4. | వేప (వైద్యగ్రంథము) : శ్రీ కే. యస్. కేసరిగారు | 0 12 0 |
| 5. | బిల్వ (వైద్యగ్రంథము) : ,, | 0 12 0 |
| 6. | అరవింద (నవల) : శ్రీమతి చిల్కపాటి సీతాంబగారు | 1 0 0 |
| 7. | శ్రీ జ్ఞానప్రసూనాంబికాశతకము : శ్రీమతి గంటికృష్ణవేణమ్మగారు | 0 6 0 |

## మా దగ్గర లభించు గ్రంథము

దేవీభాగవతము : శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు 12-8-0

## 'గృహలక్ష్మి' స్త్రీల మాసపత్రిక

వ్యవస్థాపకులు : కే. శే. డాక్టరు కే. యస్. కేసరిగారు

20 సంవత్సరములనుండి మహిళాభ్యుదయానికి, అచంచలమైన కృషిచేయుచున్న స్త్రీల సచిత్రమాసపత్రిక. త్రివర్ణ చిత్రాలతోటి, విజ్ఞాన వికాసాలను పెంపొందించే వ్యాసాలతోటి, యింకా గృహవైద్యము, కథలు, సినిమారంగము, బాలవినోదంతోటి ప్రతినెల 15-వ తేది వెలువడుచున్నది. విడిప్రతి 0.6.0

మా ఏజంట్లు లేని ప్రదేశములలో ఏజంట్లు కావలెను.

గృహలక్ష్మి కార్యాలయము

రాయపేట, మద్రాసు-14.






Lodhra Press, Madras- 14.